శ్రీరస్తు

# ఋషుల చరిత్రము

శ్రీ రావఠాంగ అక్కయ్యశాస్త్రి

గారిచే రచితము.



ప్రతులు:

శాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

# పీఠిక

మహాశయులారా!

శ్లో. "శాంతా మహాంతో నివసంతి సంతో
వసన్తవల్లోకహితం చరంతః,
తీర్ణాస్స్వయం భీమమహార్ణవం జనా
నహేతునాఽన్యానపి తారయంతః.
అయం స్వభావస్స్వత ఏవ యత్పర
శ్రమాపనోదప్రవణం మహాత్మనాం,
సుధాంశురేషస్స్వయమర్కకర్కశ
ప్రభాభితప్తామవతి క్షితిం కిల."

అని వివేకచూడామణియందు శ్రీజగద్గురు శ్రీశంకరభగవత్పాదులవారు వర్ణించినట్లు స్వతస్సిద్ధమహత్త్వముగలిగి నిరంతరభగవత్పాదారవిందచింతనామృతం గాంచి లోకోపకారము చేయుటకై తమ కొనరించి సాధించిన తపోధనమును వ్యయించుచు, నెందెందుండి యాకలములం దినుచు, మానవులసుఖమునే కోరుచు, సనాతనధర్మము నశింపక నెలకొనవలెనని కోరుచుండు మహర్షులమహత్త్వము వర్ణనాతీత మనుటకు సందియ ముండునా? త్రికాలజ్ఞానము వారికిఁ గలదనుట యొక వింతగాదు. ఎట్టిపాపకార్యము లొనరించినవారికింగూడఁ దరణోపాయము నన్వేషింతురన నింకఁ బరోపకారతత్పరులన నతిశయోక్తియగునా?

అట్టి మహర్షులలో ముఖ్యులగు నారదవసిష్ఠాదులచరిత్రము నానాపురాణములయం దున్నదానిని సేకరించి

యొక్కయుచోఁ గూర్చి యొక గ్రంథరూపమున జనుల కర్పించుట లోకమునకుఁ జేయుసత్కార్యములలో మహోత్తమ మనఁదగు. భగవన్నామములవలె మహాపురుషులనామము నిరంతరస్మర్తవ్యము. సకలపాపములఁ దొలఁగించును. ఇది విశేషించి విద్యార్థులకు నీతిమార్గము నుపదేశించునది. ఇట్టిపవిత్రచరిత్రములు వ్రాసి విద్యార్థులకు మహోపకారమొనర్చిన మ. రా. శ్రీ, రాచకొండ అన్నయ్యశాస్త్రిగారు ఎంతయుఁ బ్రశంసార్హులు. ఇట్టి యుత్తమగ్రంథముల వ్రాయించి స్వయప్రయాసముల కోర్చి ప్రకటించిన మ. రా. శ్రీ, వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారు మిక్కిలి కొనియాడఁదగినవారు. ఇట్టి గ్రంథరత్నము లాంధ్రభాషయందింకఁ జాల తక్కువగ నున్నవి. కావున, విద్యాధికారు లీగ్రంథమునకుఁ జేయూఁత యొసంగుదురుగాక! విద్యార్థు లీగ్రంథములఁ జదివి మహాపురుషుల యాశీర్వచనములకుఁ బాత్రు లగుదురుగాక! భగవంతుఁడు సర్వేశ్వరుఁడు కరుణానిధి రాధామాధవమూర్తి సనాతనధర్మమార్గమును గాపాడుఁగాక!

ఇట్లు,

సుజనవిధేయుఁడు,

జనమంచి శేషాద్రిశర్మ.

శ్రీ రస్తు.

# ఋషుల చరిత్రము

## 1. నారదమహర్షి.

సృష్టికర్త, కమలజుండు, సృష్ట్యాదిని సనక-సనందన-సనత్కుమార-సనత్సుజాతులను నలుగురు మానసపుత్త్రులఁ బడయించెను. వారలు వేదశాస్త్రపారంగతు లగుటఁ, బ్రహ్మ సంతసిల్లుచు, వారలఁ జీరి, "వత్సలారా! సృష్టి యొనరించి సుఖముఁ బడయుఁడు. పొం"డని వారల నాదేశించెను; కాని, యామానసపుత్త్రులు నలుగురును ప్రవృత్తిమార్గావలంబనమునందు మనసుఁ జొరనీయక, నివృత్తిమార్గముఁ జేకొనిరి. అంతఁ జతురాననుఁడు, మరల తనమనస్సువలన మరీచి-అత్త్రి-అంగిరః-పులస్త్య - పులహ - క్రతు - భృగు-వసిష్ఠ-కర్దమ-దక్ష-నారదులనువారలను పదునొకండుగురుపుత్త్రుల నుత్పన్నులఁ గావించెను. కాలక్రమమున వారందఱు వేదశాస్త్రపారంగతులును, బహుతపోధనసంపన్నులును నై, తండ్రిమనమున కామోదమొదవఁగూర్పఁజొచ్చిరి. అంత బ్రహ్మ తనపుత్త్రులఁ గని సంతసిలుచు, జ్యేష్ఠానుక్రమముగఁ బదుగురపుత్త్రులఁ బరిణీతులఁ గావించి, "సంతానమును బడసి సృష్టిని వృద్ధి యొనర్పుఁ" డని యాదేశించి పనిచి, కనిష్ఠుఁడును, పదునొకండవవాఁడును నగు న్నారదునిఁ బరిణీతునిఁ గావింప నుద్యుక్తుఁడయ్యెను. నారదుఁడు

సాంసారికజీవనమునం దభిరుచి లేనివాఁడై, తండ్రిం జేరి, "కన్న తండ్రీ! సాంసారికజీవనము కష్టములకు గని, దుఃఖముల కాకరము, క్లేశములకు నిలయము. అద్దానిని నామన మొల్లకున్నది. కాఁబట్టి ప్రవృత్తిమార్గము నాకేమాత్రమును రుచియించుట లేదు. విషయవాసనాజాలమునకు లోనైనవారలు పలువిధములగు దుఃఖములకుఁ బాలుకావలసినవార లగుదురు. నేనిదె ప్రార్థించుచున్నవాఁడను. నన్ను సంసారరూపకమగు భయదగహ్వరమునఁ గూలఁద్రోయ మదిఁ దలంపకుఁడు. నాయీతుచ్ఛజీవనమును భగవత్సేవాకైంకర్యమునకు లోనొనర్చి భవసాగరమును దాఁట నొనరించుటకుఁ గృతనిశ్చయుండ నైతిని. నన్ను మన్నింపుఁడు. నిశ్చలమును నిష్కామమును నగు భగవద్భక్తిని దయచేయుఁ"డని ప్రార్థించుచు, తనమనోనిశ్చయమును భక్తివినయములతో నిజజనకున కెఱుకపఱచెను నారదుని వైరాగ్యపుఁబలుకుల నాలించి చతుర్ముఖుఁడు కుపితుఁడై, "నామాట పాటింపక ప్రతికూలుఁడవై త్రోసిపుచ్చ నెంచితివి. కావున, గంధర్వవంశసంజాతుఁడవై, అర్ధశతసంఖ్యాకు లగుసుదతులకు దయితుఁడవై, యెడలేనివ్యామోహమున మనువాఁడవగుదువు గాత" మని యాతని శాపదగ్ధునిఁ గావించెను. జనకశాపానుసరణముగ నారదుఁడు శీఘ్రముగ గంధర్వకులమున జనియించి, ఉపబర్హణనామధారియై యథాసమయమునఁ జిత్రరథుఁడను గంధర్వుని కూఁతుల నేఁబదుగురను బరిణయమయ్యెను.

అనంతర మొకప్పుడు బ్రహ్మ దేవర్షిగణంబులతో పుష్కరతీర్థమున కరిగినపుడు ఉపబర్హణుని రావించి, "నాట్యకళాకౌశలమును, గానవిద్యానైపుణ్యమును బ్రదర్శింపు"మని యాతని

కాజ్ఞయొసంగెను. తదాజ్ఞానుసారముగ నుపబర్హణుఁడు కృష్ణ లీలాకథాసంకీర్తనమును ప్రదర్శించెను. ఆసమయమం దాతఁడు జూపిన నాట్యనైపుణ్యమునకును, గానవిద్యావైశిష్ట్యమునకును, బ్రహ్మయు, దేవతలును,ఋషులును కడుంగడు ప్రసన్నులై, పలు విధముల నాతనిఁ బురస్కృతునిఁ గావించి తనివొందక, పునః ప్రదర్శనమున కాజ్ఞయొసంగిరి. ఆజ్ఞమేరకు నుపబర్హణుఁడు, శ్రీకృష్ణునిబృందావనవిహారమును ప్రదర్శించుచు,గోపికావిరహ వర్ణనాసందర్భమున భక్తిపరవశుఁడై, యొడలెఱుంగక శాస్త్రభంగ మొనరించెను. అందుచే విశిష్టులగు దేవతలును ఋషులును క్రుద్ధులై, యాతని దూషణముల నీడుపఁజొచ్చిరి. బ్రహ్మ యాతని దాసీపుత్రుఁడగునటుల శపియించెను. అంత నుపబర్హ ణుఁడు విగతధైర్యుఁడై, భయవిహ్వలుఁడై, వారలఁ బ్రసన్న చిత్తులుగఁజేయుట కుపాయాంతరమును గానక, యార్తజనశర ణ్యుఁడగు భగవంతుని తదేకచిత్తమున ధ్యానింపఁజొచ్చెను. భక్తవత్సలుఁడును, దీనజనదుఃఖభంజనుఁడును నగు కమలా మనోహరుఁడు ఉపబర్హణుని భక్తి కలరి యందావిర్భూతుఁడై యాతని కభయ మొసంగుచు,“వత్సా!నీకేమియు భయము లేదు. నేనుశరణాగతవత్సలుఁడను, భక్తజనప్రియుఁడను.పరిశుద్ధాంతః కరణమున నన్నే స్మరించుచు, నన్నే శరణ్యునిగ నమ్మియున్న వ్యక్తులను విపత్తులు చుట్టుకొననేరవు. ఈదేవతలు విబుధు లును నిన్నేమియుఁ జేయఁజాలరు; కాని, ప్రజాపతి, బ్రహ్మ యొసంగినశాపము నీకవశ్యభోక్తవ్యము, అనుభవైకవేద్యము. ఆతనివాక్కమోఘము. ఈజన్మాంతమున దాసీగర్భజనితుఁడవై పంచవర్షవయస్కుఁడవగుఁడు నొకానొకబ్రహ్మవిద్వరిష్ఠుని వలన మంత్రదీక్ష గ్రహియింపఁగలవాఁడవగుదువు. దీక్షాగ్రహ

ణానంతరము పదియేండ్లు గడచునంత శూద్రశరీరమును బరిత్యజించి దేవఋషివై నాకు సహచరుఁడవుగాఁగలవు” అని పలుకుచు నందుండి యంతర్ధానుఁడయ్యెను. అనంతరము సమయ మాసన్నమగుఁడు, ఉపబర్హణుఁడు గంధర్వతనువును పరిత్యజించి దాసీగర్భజనితుఁ డయ్యెను. ఆదాసి యొకానొక బ్రహ్మవాది యగుబ్రాహ్మణునకుఁ బరిచారిక.

ఒకప్పుడు పెక్కండ్రుమహర్షు లరుదెంచి, యాబ్రాహ్మణగృహమునందు చాతుర్మాస్యవ్రతదీక్షోపరతంత్రులై వసియింపఁ జొచ్చిరి. ఆకాలమున వారలకు బాలుఁడగునారదుఁడు పరిచర్య చేయఁదొడంగెను. ఆతఁ డొనర్చుపరిచర్యలకు ఋషులుఁ బ్రసన్నులై భుక్తశేష మాతనిభుక్తి కొసంగుచుండెడివారు. మహర్షు లొసంగుభుక్తశేషమును మహాప్రసాదముగ గ్రహయించి, యద్దానిని భక్తిపూర్వకముగ భుజియించుచుండినకతమున నాతనిహృదయము విశుద్ధమైనదయ్యెను. అందువలన నాతనికి భగవత్పాదారవిందములయందలి భక్తి యతిశయమయ్యెను. ఉక్తమహర్షులు హరిగుణగాన మొనర్చుసమయమున నాబాలుఁడు నారదుఁడు స్థిరచిత్తుఁడై, భక్తిపరవశుఁడై యాలించుచుండువాఁడు. ఆబాలుని నిశ్చలచిత్తమును, నిశ్చలభక్తినిఁ బరికించి, యుక్తమహర్షులలో నొక రాతనిని శిష్యునిగ గ్రహియించి, మంత్రదీక్షితునిగఁ గావించెను. ఈదీక్షవలన నారదుని హృదయమున వైరాగ్య ముదయమయ్యెను. గురువులు బ్రాహ్మణగృహమును వీడి చనినపిమ్మట నారదునకు గృహపరిత్యాగమునం దిచ్ఛపొడమెను; కాని, తల్లి క్లేశవివశ యగునని యట్లుసేయక, మాతృసేవయందు లగ్నమనస్కుఁడై గృహవాసమును సలుపఁజొచ్చెను. అంత నొకనాఁటిరాత్రి యాతనిజనని

గోదోహనమున కఱుగుచుండ నొకతఱి సర్పదష్టయై మృత్యు ముఖముఁ గనియెను. మాతృమరణానంతరము నారదుఁడు గృహవాసమును పరిత్యజించి యుత్తరదిశ కరిగి, యందొక యరణ్యమున నివసించుచు, నందలి సరోవరమున స్నానమాడుచు, వటవృక్షచ్ఛాయఁ గూర్చొని గురుదత్తమగుమంత్రమును జపించుచు, భగవచ్చింతనాసక్తి నలరారుచు నచిరకాలముననే భగవద్దర్శనమును బడసినవాఁడయ్యెను. అతఁడు తనకెట్టెదుర సాక్షాత్కరించిన శ్రీహరిని దర్శించినంతనే భక్తిపరవశత్వమునఁ బులకితగాత్రుఁడయ్యెను. అశ్రుజలపూర్ణనయనుఁడయ్యెను. గద్గద కంఠుఁడయ్యెను. ఆనడుమ శ్రీమన్నారాయణుఁ డంతర్ధానుం డయ్యెను. మరల శ్రీహరి సాక్షాత్కారమును బడయుటకు నారదుఁడు పలుయత్నము లొనరించెను. కాని, కృతకృత్యుఁడు కాఁజాలనివాఁడయ్యె. అంత నాతఁడు వికలమనస్కుఁడు కాఁగా శ్రీహరి కరుణార్ద్రహృదయుఁడై యాకాశవాణీముఖమున "నారదా! యీజన్మమున మరల నాదర్శనమును బడయఁజాలవు. నీకు నాయందుగలభక్తి నతిశయ మొనరించుటకునై యొకపరి దర్శన మొసంగితిని. నాయందు నిశ్చలభక్తిఁ గలిగియుండువారలకు వారిమనోరథములు అపూర్ణములు కానేరవు. వారలను నాక్రమించుకొనియున్న కామక్రోధాదిశత్రువర్గము సమూలముగ నాశనమగును. కాఁబట్టి నన్ను భక్త్యనురాగములతో నిరంతరము భజియించుచుండుము అట్లు చేయుచుండుదువేని, శీఘ్రకాలములోనే యీశూద్రశరీరమును పరిత్యజించి దివ్యతనుధారివై, నాకు సహచరుఁడవై కృతార్థతఁ బడయఁగలవాఁడ వగుదువు' అని యాతని కెఱుకపఱిచెను."

ఆకాశవాణిముఖమున శ్రీహరి పలికినపలుకుల నాలించి నంతనె నారదునకు ధైర్యము అతిశయమయ్యెను. భక్తి స్పృహ తరమయ్యెను. కాలానుకరణని నారదుఁడు శూద్రశరీరమును త్యజియించెను. దివ్యదేహమును ధరియించెను. శ్రీహరికి సహాచరుఁడయ్యెను. అనంతరము, ఈశ్వరునివలన భక్తివిషయమై యుపదేశమును బడసినవాఁడయ్యెను. ఈశ్వరునివలనఁ బడసిన భక్తితత్త్వోపదేశవిషయములను గ్రంథస్థ మొనరించి,యాగ్రంథ రాజమునను 'నారదపంచరాత్ర'మని నామకరణముఁ జేసెను. నారదుఁడు వ్రాసినభక్తిసూత్రములపై, 'తదీయసర్వస్వ'మను వ్యాఖ్య యొండు వెలువడియెను

నారదుఁడు, భక్తచూడామణి యని పేరొందిన ప్రహ్లాదునకు తత్త్వోపదేశకుఁడు. దేవవిరోధి హిరణ్యకశిపుఁడు, మందరాద్రియందు బ్రహ్మఁ గూర్చి ఘోరతపము సలుపుచుండు తరుణమున, నాతనిభార్య గర్భవతియై యుండెను. ఆగర్భమునఁ బ్రహ్లాదుఁడు పెరుగుచుండెను. ఆతఁ డుదితుఁడైనఁ దనకు ప్రబలవిరోధి యగువాఁడగు ననువెఱపును మఱిఁగొని, యాతనిఁ బుట్టిన వెనువెంటనే మడియింపఁ గృతనిశ్చయుఁడై హిరణ్యకశిపుఁ డింటలేనిసమయము సుసమయమని తలఁచి దేవరా జింద్రుఁడు, హిరణ్యకశిపుభార్యను అమరావతికిఁ జెఱఁగొనిపోవుచుండెను. ఆసమయమున దేవర్షి దేవరాజున కడ్డుపడి "ఈసాధ్వీగర్భజనితుఁడు పరమభాగవతోత్తముఁ డగుఁ గాని, నీవనుకొనునట్లు నీకు శత్రుఁడు కాఁడు. ఈసుందరిఁ జెఱఁగొనుట నీకుఁ దగదు. విడిచిపుచ్చుము. ఈమెభర్త తపస్సు నుండి మఱలివచ్చునంతదనుక నీమెను నాయాశ్రమమున నునిచికొని కన్నకూఁతునుబోలె సంరక్షించెద" ననిపలికి యామెఁ

మును వివరించి చెప్పెను. ధ్రువుఁడు నారదోపదేశానుసరణిని కఠోరతప మొనర్చి శ్రీహరిసందర్శనమును బడసి ప్రశాంత చిత్తుఁ డయ్యెను.

నారదుఁడు దక్షప్రజాపతిపుత్త్రులను పలువురను మోక్షధర్మము నుపదేశించి విరాగులఁజేసి తపంబొనర్చుట కరణ్యమున కనిపియుండెను. అందువలన, దక్షప్రజాపతి పుత్త్ర శోకానలజ్వాలాసంతప్తమానసుఁడై నారదునిఁ జేరి, "అబోధ బాలకులగు నాపుత్త్రుల విరాగులఁజేసి సంసారదూరులుగఁజేసి లోకభ్రమణమునకుఁ బాలుగావించినవాఁడవు కావున, వారి వలె నీవును మూఁడులోకములయందును నిలువనీడఁగానక నిరంతరము పరిభ్రమణ మొనర్చువాఁడవగుదువుగాత" మని యాతని శాపదగ్ధునిఁ గావించెను.

ఒకప్పుడు, నారదుఁడు యక్షరాజపుత్త్రులు నలకూబర మణిగ్రీవులు నిరువురును, ఇరువురుసుందరీమణులఁగూడి క్రీడా కౌతుకమున నొప్పియుండుస్థానమున కరుదెంచెను. అట్లరు దెంచిన నాఋషిసత్తమునిఁ జూచి యారమణీమణులు సంకుచిత చిత్తులైరి. కాని, నలకూబరమణిగ్రీవులు ధనమదాంధులై, నారదాగమనమును సరకుఁగొనక యథాపూర్వముగ క్రీడా కౌతుకమున విరాజిలఁజొచ్చిరి. అట్లు యక్షరాజపుత్త్రులిరు వురు ననుచితవర్తనమునఁ బ్రవృత్తులై యొడలెఱుఁగక యున్న వారలను గని నారదుఁడు కినిసి "వ్రజధామమునందు మీర లిరువురు నర్జునతరువులై నిలువుఁడు పొండు" అని పలుకుచు వారలను శాపోపహతులఁ గావించెను. అనంతరము శ్రీకృష్ణ చంద్రుఁడు వారలను శాపవిముక్తులఁజేసి యుద్ధరించెను.

దేవర్షి నారదుఁడు, ధర్మచారిణి పాంచాలి యొక్కసౌంద ర్యమును, మహిమయొక్క ఔన్నత్యమును వర్ణించిన, నప్పుడు కంక్రిందుమూస ములు తీర్థయాత్రాప్రసంగమున మొదల్పఁబడినయు నసుసియనము నకుఁ బాండవులను బట్టి రాఁగా పంచి వారిని కౌరవులయొక్క విరోధమునకుఁ బాత్రులఁజేసి, భ్రాతృవాత్సల్యమును కౌరవ పడనివారలుగ నొనర్చెను. కపటద్యూతమున యుధిష్ఠిరుని బరాజితునిఁజేసి పాండవుల నవమానితులఁ గావించి వారిసహ ధర్మిణిని, ద్రౌపదిని పరిభవించి, వారలను సపత్నీకముగ నరణ్య గాములఁ గావించిన దుర్యోధనాదులకెల్ల కుపితుండై, "నేఁడు మొదలుగ పదునెనిమిదిసంవత్సరములు గడచునంత, మీ రొనర్చిన యీఘోరాపరాధమునకు ప్రతిఫలముగ మీకులము వినష్టమొందుఁగాత" మని కౌరవులకు శాప మొసఁగెను.

నారదుని జీవనచరిత్రమందు ఉల్లేఖనీయాంశములు పెక్కులు గలవు. ఆతఁడు లోకమున కొసంగిన మహోపదేశరత్నములవలన పెక్కులు గ్రంథరాజములు వెలుఁగొందు చున్నవి. ఆతని యుపదేశముచొప్పుననే పరాశరనందనుఁడు వ్యాసుఁడు శ్రీమద్భాగవతరచనమునకుఁ దొడంగినవాఁ డాయెను.

నారదుఁడు భూలోకవార్తలను దేవలోకమునకును, దేవలోకవార్తలను భూలోకమునకును గొని చనుచు వార్తా వహుఁడని పేరొందినవాఁడు. ఆతనిగతి ముల్లోకనిర్నిరోధము. నారదుఁడు కలహభోజుఁడు. వారిరహస్యములను వీరికిని వీరి రహస్యములను వారికిని తెలియపఱచి వారికిని వీరికిని విరోధ మును కలిగించెడువాఁడని యాతనిపై దోషారోపణ మొందో

నర్చియుండిరి, కాని, యాతనిజీవనచరిత్రమును గూర్చి ధ్యాన పూర్వకముగ విచారణ మొనరించువారలు అతఁడు వినోద ప్రియత్వముతోఁబాటు లోకహితైషికత్వమునుగూడ గమనించి దూతకృత్యమును వహించియున్నవాఁడను విషయమును గుర్తింపనేరనివారలు కాఁజాలరు. అనేకసమయములలో నారదోపదేశమువలననే దేవతలు రాక్షసులను నాశన మొనరింపఁగలిగినవారలు కాఁగలిగిరి. స్వర్గమందుండినపాండురాజు యొక్క సందేశమును భూలోకమునకు గొనితెచ్చి ధర్మజున కెఱుకపఱచి, యాతనిచే రాజసూయయాగమును జేయించెను. నారదుని పుణ్యశ్లోకవార్తావలితో మహాపురాణోపపురాణము లన్నియు నిండియున్నవనుటకు సందియములేదు. నారదుఁ డొకగానవిద్యాచార్యుఁడని సాంబపురాణము ప్రకటించు చున్నయవి.



## 2. వశిష్ఠమహర్షి.

వశిష్ఠమహర్షి బ్రహ్మమానసపుత్త్రులలో నొకఁడు. బ్రహ్మవిదుఁడు. మహర్షిగణమునం దగ్రగణ్యతను బడసినవాఁడు. సప్తర్షిసంఘమునందుఁ బరిగణింపఁబడినవాఁడు. ఆసాము, అయోధ్య, చీనాప్రాంతములయందలి యరణ్యములు వశిష్ఠుని తపోవనములని సుప్రసిద్ధిఁ గనియున్నవైనను, అతఁడు భరత ఖండములోని భిన్నభిన్నప్రదేశములలో తపంబొనర్చి ఆయా ప్రదేశములను పవిత్రవంతములుగ నొనర్చియున్నవాఁడు. అతఁడు కర్దమప్రజాపతిపుత్త్రికయు, పతివ్రతాశిరోమణియు

నగు అరుంధతీదేవిని సహధర్మచారిణిగఁ గైకొనినవాఁడు. అరుంధతి పతిసేవాపరతంత్ర. పతిఁదక్క నితరదైవములను కలలోనైనఁ దలంచియెఱుఁగని పరమసాధ్వి సతులకు పతిసేవయే పరమధర్మమని పరిగణించిన నారీశిరోమణి. వశిష్ఠుఁ డామె గర్భమునందు నూఱుగురుపుత్త్రుల బడసినవాఁడు ఆపుత్త్రులలో శక్తియనునతఁడు జ్యేష్ఠుఁడు. అతఁడు వేదవేదాంగవిదుఁడు షట్ఛాస్త్రపారంగతుఁడు. అదృశ్యంతి యనుకన్యారత్నమును బరిణయమైనవాఁడు. అదృశ్యంతి అసదృశరూపలావణ్య, సద్గుణసంపన్న, ధర్మపరాయణ.

ఒకప్పుడు, గాధిరాజనందనుఁడును, అయోధ్యాధిపుఁడును అగువిశ్వామిత్రుఁడు,మృగయావినోదియై,పరిభ్రమించుచు వశిష్ఠతపోవనంబున కరుదెంచెను. బ్రహ్మర్షివరిష్ఠుఁడగు వశిష్ఠుని కడ నందినియనుపేరుగల హోమధేను వొకండుగలదు. అయ్యది, బ్రహ్మర్షియాజ్ఞమేరకు ఆవశ్యకతానుసరణముగ పలువిధములగు అన్నపానీయములను స్వాదిష్టపదార్థములను ప్రదానమొనర్చుటయందు సర్వసామర్థ్యముఁ గలయది. ఆహోమధేనువుసహాయమున వశిష్ఠమహర్షి తనయాశ్రమమున కరుదెంచిన విశ్వామిత్రుని, నియమానుసరణిని, సైన్యయుతముగ నాతిథ్యమొసంగి సత్కరించి సంతుష్టాంతరంగునిగఁ జేసెను. నందినియొక్క యాయద్భుతగుణసామర్థ్యములఁ దిలకించి విశ్వామిత్రుఁడు సాశ్చర్యుఁడై లోభపరవశుఁడై యాధేనువును దనకిమ్మని వశిష్ఠుని సవినయముగఁ బ్రార్థించెను. అంత, వశిష్ఠుఁడు, “మహారాజా! గాధినందనా! విశ్వామిత్రా! ఈనందినికారణముగ నాధర్మసర్వస్వము నిర్విఘ్నముగ నిర్వహింపఁబడుచున్నది. భోజనభాజనములు వినాపరిశ్రమముగ లభ్యములగుచున్నవి. దీని

నెనఁబాయుదునే నాధర్మాచరణమునకు,నాజీవననిర్వహణమునకు వజ్రాఘాత మాపాదితమగు. అంతియకాదు, ఈనందిని నన్ను వీడనేరదు. వీడునదియగునేని తనసామర్థ్యమును గోలుపోవు నదియగును. నందినివలన నేనును, నావలన నందినియును పరస్పరము సంరక్షణముఁబడయుచు సర్వశక్తిసంపన్నుల మగుచున్నవారము. కాఁబట్టి దీనిని నీకొసంగఁజాలను." అని విశ్వామిత్రునకు బదులొసంగెను. వశిష్ఠుని ప్రత్యుత్తరము విశ్వామిత్రుని చెవులకు ములుకులవలె గాఢతమముగ నాటినవయ్యెను. అందువలన నాతఁడు క్రుద్ధుఁడై నిజపరిచారకులఁ రావించి "నందిని బంధించి కొనితెండు" అని వారల నాజ్ఞాబద్ధులఁగావించెను. విశ్వామిత్రునిదుర్వర్తనమును విలోకించి యెంతయుఁ బరితపించుచు, వశిష్ఠుఁ డశ్రుపూరితనయనుఁడై, నందినిఁ బరికించి, "కళ్యాణీ! ఈయుద్ధతక్షత్రియుఁడు మనలనిరువురను అవమానితులుగఁజేయ సమకట్టెడిని మనలనిరువురనెడబాపి దుఃఖనిమగ్నులఁగావింప నుంకించుచుండె. తరుణమాసన్నమయ్యెను. ఇఁక నీసామర్థ్యముఁ బ్రకటించుట కుద్యుక్తవగుము. అంతకన్న వేఱు శరణ్యముసు గానము. ఈలోభచిత్తునిఁ దగుఫల మనుభవింపఁ జేయుము. దుర్జనులయెడ దయాదాక్షిణ్యములఁ జూపుటకు వలనుపడదు. అయ్యదిలోకవినాశకము. పాపమూలకము." అని పలుకుచు నద్దానికి హెచ్చరికఁగలుగఁజేసెను. వశిష్ఠునియాజ్ఞకు ప్రతీక్షించుచున్న నందిని యాతనినోటినుండి మాటవెలువడుటయె తడవుగ, తనశరీరమునుండి యపారసేనావాహినిని వెలువరించి విశ్వామిత్రుని దర్పితపరివారమును ముంపఁజొచ్చెను. అంత పరిచారకులు బహుతరముగ క్షతికిఁబాలై నిలుపోపనేరక పటాపంచలై పరుగిడఁజొచ్చిరి. అట్లు స్వప్రాణసంరక్షణాతుర

కేగి యాతని నుత్తేజితునిగఁ జేసి యాతనిచేత వశిష్ఠపుత్త్రులను నూఱుగురను మడియింపఁజేసెను. ఈఘోరకృత్యము నాలించి వశిష్ఠుఁడు పుత్త్రశోకానలతప్తచిత్తుఁ డయ్యెను. దుఃఖవిహ్వలుఁ డయ్యెను. కల్మాషపాదునిమూలముగ విశ్వామిత్త్రుఁడొనర్చిన ఘోరకృత్యమునకు ప్రతికృతియొనర్చుటకుకడుఁగడుసమర్థుఁడై యొప్పుచుండియును క్షమావతారుఁడు వశిష్ఠుఁడు, అట్లు సలుపక, తనభాగ్యమీవిధముగఁ బరిణమించినదిగదాయని పరితపింపఁజొచ్చెను. పుత్త్రశోకానలదందహ్యమానమానసుఁడు, వశిష్ఠుఁడధీరుఁడై ప్రాణపరిత్యాగోన్ముఖుఁడై పర్వతాగ్రమునుండి క్రిందకుఁబడియెను, గాని, యందువలన నాతఁడు ప్రాణములను విడుచుటలేదు సరియేగదా, క్షతశరీరుఁడును గూడఁ గాఁడయ్యెను. అనంతర మగ్నికుండములోని కుఱికెను. కుత్తుకకు బండలుకట్టుకొని సముద్రములోనికి దుమికెను. ప్రాణత్యాగమునకుఁ బలుయత్నము లొనరించెను; కాని మృత్యుముఖమును గననేరనివాఁడయ్యె. ఎన్నిపాట్లుపడినను, ఎన్నియత్నములొనర్చినను మరణమొనఁగూడమికి మిక్కిలిగఁ జింతిలుచు, నిజాశ్రమమున కరుదెంచెను, గాని పుత్త్రశూన్యమగు నాయాశ్రమమును గనినంతనె శోకము ద్విగుణీకృతమగుడు, నందు నిలువనేరక మరల ప్రాణపరిత్యాగోద్యమమునందు ప్రవృత్తుఁడై బయలువెడలెను. కాలుసేతులను లతాపాశములతో బంధించుకొని తనశరీరమును వేగవంతముగఁ బ్రవహించునదీమధ్యమునఁ గూలఁద్రోచెను. అట్లు ప్రవాహమధ్యమునకు లోనైన బ్రహ్మర్షి ప్రాణహరణము బ్రహ్మహత్యాపాతకమునకు కారణమగునను వెఱపునుగొని యానది తనసునిశితలహరీలవిత్రములతో నాతనికాలుసేతులన మరియు లతాపాశబంధములను

క్షేపించి, యాతని సురక్షితునిగఁ జేసి తీరమునకుఁ జేర్చెను. అంత వసిష్ఠుఁ డావది తనపాశబంధములను విదళించినదగుటకారణమున నద్దానికి 'విపాశ' యని పేరిడి యెందేని చనియెను. అనంతరము తిమింగిలములకు నిలయమగు మఱియొకనదీమధ్యమునఁ గూలఁబడియెను. ఆనది కూడ నాతని కపకృతి యొనరింపలేక పోవుటయే గాక, యాతని బ్రహ్మతేజమునకు నిలుపోపనేరక శతధార లై యాతనివలన 'శతద్రు' వనునామమును బడసినదయ్యెను. ఇట్లు మాటిమాటికిని ప్రాణపరిత్యాగప్రయత్నమున ప్రవృత్తుఁడై, సఫలతఁ బడయఁజాలక తుదకు హతాశుఁడై, ఉదాసచిత్తుఁడై నిజాశ్రమమునకు మరలవలసినవాఁడాయెను.

వసిష్ఠుఁడు ప్రాణపరిత్యాగోద్యమమునుండి విరమించి స్వాశ్రమమునకు మరలుచుండెను. ఆతనిఁ గని యాతని జ్యేష్ఠవధూరత్నము, అదృశ్యంతి సంతోషతరంగితాంతరంగయై యాతనివెనువెంట నరుగుచుండెను ఆసమయమున నామె యంతర్వత్నియై యొప్పుచుండెను. అట్లు అంతర్వత్నియైన యదృశ్యంతి వసిష్ఠుని వెనుదగిలి చనుదెంచుచుండుసమయమున నాతనికి వేదశ్రుతికర్ణగతము గాఁజొచ్చెను ఆవేదశ్రుతి యొందుండి యొవనివలన వినవచ్చుచుండెనో యెఱుఁగఁగోరి వెనుదిరిగి నలువైపులఁ బరికించిచూచి యేరినిఁ గానక, నివ్వెఱఁగొని పుత్రవధువుఁదిలకించి, "యీవినవగు వేదశ్రుతి యొందుండి యరుదెంచుచుండె"నని ప్రశ్నించెను. అందుల కామె, "యోపితా! నీపౌత్రుఁడొకఁడు నాగర్భమందు పండ్రెండుసంవత్సరములుగఁ బెరుగుచున్నవాఁడు ఆతఁడు చతుర్వేదములను, షట్ఛాస్త్రములను నభ్యసించినవాఁడు. గర్భస్థుఁడగు యర్భకునివలననే యీ వేదశ్రుతి వినవగుచుండెను" అని బదులొసంగెను. ఆపలుకుల

పాలించినంతనె వశిష్ఠమహర్షి తనవంశమునకు విచ్ఛేదము కలుగ లేదని సంతసిలుచు మరణేచ్ఛను హృదయమునుండి దూరగత మొనర్చి నిర్వికారముగ దేహజీవనమును నిర్వహణమొనరింప నిశ్చయించెను. అనంతరము మోహాసముద్రమును పారమొన రింప మునెంచి నిష్ఠురతపోనిరతుఁడై బ్రహ్మజ్ఞాన ఫలవఱచు కొనెను ఆతనికడ బ్రహ్మవిదునికడఁ జూపట్టవలయు లక్షణము లన్నియు సంపూర్ణముగ ప్రకటితములు గాఁదొడంగెను. అంత మున నచ్యుతపదమును జూఱఁగొనియెను. ఆతఁడు వశిష్ఠ సంహిత యోగవాశిష్ఠరామాయణము లను గ్రంథములను రచి యించెను. ఆగ్రంథములు సర్వత్ర ఆదరదృష్టిఁ బరికింపఁబడు చున్నవి.

వశిష్ఠుఁడు, ఇక్ష్వాకువంశీయ రాజవర్యులకు పురోహితుఁ డుగనుండుచు ధర్మోపదేశ మొనర్చుచుండుటయేగాక సమయా నుగుణముగ రాజనీతి సూక్ష్మతత్త్వమును బోధించుచు తద్రాజ వర్యులచే రాజ్యమభేద్యమై ధనధాన్యసమృద్ధిఁగని వర్ధిల్లుట కనువగుమార్గములను ప్రదర్శింపఁజేయుచుండెను. ఆతఁడు శ్రీ రామచంద్రునకు జ్ఞానోపదేశకుఁడగుట కారణముగ నాతనికి గురువయ్యెను. దశరథరాముఁడు పితృవాక్యపరిపాలనాపర తంత్రుఁడై యరణ్యావాసమున కరిగినపుడు, భరతుని కొసంగిన యుపదేశము కాలానుగుణ్యముగ మహత్త్వపూరితమును, బహు మూల్యము నుపాదేయమునునై విరాజిల్లుచుండెను. మార్గదర్శ కులును పరోపకారపారీణులును నగుమునివృషభులు పలువురు గలరు గాని, వారిలో వశిష్ఠునింబోలిన జితక్రోధులు క్షమా శీలురుఁ జూపట్టుట మిక్కిలి యరిది. విశ్వామిత్రుఁడు తనకుఁ జేసిన యపకృతికి ప్రతికృతిగ, బ్రహ్మర్షి వరిష్ఠుఁడు వశిష్ఠుఁడు, అవలంబిం

చినమహౌదార్యము లగుసీతిక్షమామార్గములు ఆతనిమాహా త్మ్యప్రశస్త్యమునకు ప్రధానద్యోతకములై యలరుచున్నయవి.

వశిష్ఠప్రశస్తములగు ప్రశంసావచనములఁ గ్రహియించుట గౌరవచిహ్నములని తత్కాలీనమహాత్ములు పరిగణించుచుండెడి వారు. ఆకారణముననే విశ్వామిత్రుఁడు, వసిష్ఠునియెడ క్రోధ వైరములఁబూని యాతనివలన నిర్బంధపూర్వకముగ 'బ్రహ్మర్షి పదవిఁ' గ్రహియించుటకు భగీరథప్రయత్న మొనర్పుటయందు ప్రవృత్తుఁడయ్యెను. విశ్వామిత్రునిహృదయమున నంతస్సలిల యగు ఫల్గునవలె నంతశ్శత్రువులు విద్యమానములై యొప్పు చుండినంతవఱకు, సాటితపస్వు లెందఱెన్నివిధములఁ నిరోధించిన నుచితవక్తయగువసిష్ఠుఁ డాతని 'రాజర్షి' యనియే సంబోధించెనుగాని, 'బ్రహ్మర్షి'యని యేయవస్థయందును సంబోధించిన వాఁడు కాఁడు.

ఒకప్పుడు విశ్వామిత్రుఁడు, వశిష్ఠునిఁ బొరిగొన మదినెంచి సునిశితకరవాలమును గేలఁగొని యొకనిశీథమం దాతని యాశ్రమగేహమునకరిగి, యాతఁడు మేలుకొనియున్నవాఁడో లేక నిద్రించుచున్నవాఁడో యనువిషయము నెఱుంగనెంచి, తద్ద్వారసమీపమునఁ బొంచియుండెను. ఆసమయమున వశిష్ఠుఁడు మేల్కాని సహధర్మిణి యరుంధతీదేవితోడి యిష్టాగోష్ఠులఁ బ్రొద్దుపుచ్చుచుండెను. అపుడు సందర్భానుసరణముగ, "ప్రాణనాథా! నేటివెన్నెల యెంత యాహ్లాదకరముగ నొప్పుచున్నదియో, చూడుఁడు." అని యరుంధతి యన, "అవును ప్రాణేశ్వరీ! యథార్థమును బలికితివి. నేటివెన్నెల మహాతపస్వి విశ్వామిత్రుని తపస్సుఁబోలె, నాహ్లాదకరమేగాదు, జగత్పవిత్రకారకమును, లోక

మోహానమునునై యలరారుచున్నయది." అని వశిష్ఠుఁడు బదు
లొసంగెను. యుక్తియుక్తములగు నీయరుంధతీవశిష్ఠుల వాక్యో
పవాక్యములు, ద్వారముకడ పొంచియుండిన విశ్వామిత్రుని
వీనులయందుఁ జొరఁబడి యాతనిహృదయసీమను నాటుకొని
పెరుఁగుచున్న క్రోధవిరోధములను సమూలముగ నాశనమొన
రించి, తత్స్థానమందు క్షమాశాంతములను నెలకొల్పెను. అంత
విశ్వామిత్రుఁడు ప్రశాంతచిత్తుఁడై వశిష్ఠసందర్శనమున కందు
వేచియుండెను. అనంతర మొక్కింతతడవునకు వశిష్ఠుఁ డాశ్రమ
గేహమునువీడి బయటికరుదేర విశ్వామిత్రుఁ డాతనికి సాష్టాంగ
నమస్కృతుల నర్పించి, తానొనర్చిన యకృత్యములను క్షమింపుఁ
డని యాతని బహుభంగులఁ బ్రార్థించెను. ఉదారహృద
యుఁడు వశిష్ఠుఁ డాతనిదీనావస్థఁ గని దయార్ద్రహృదయుఁడై
యాతని నాలింగనమొనర్చి పలువిధముల బహూకరించుచు
"ఇపుడుకదా బ్రహ్మర్షిపదవిఁ గ్రహియించుటకు పాత్రతఁ గడి
యించినవాఁడ వైతివి" అని పలికెను. క్షమావతారుఁడని
పేరొందినవశిష్ఠునిఁబోలిన మహర్షు లరుదుగఁజూపట్టుదురనుటకు
మనపురాణములు ప్రబలనిదర్శనములు. వశిష్ఠుఁ డాదర్శచరితుఁ
డనుటకు సందియము లేదు.

# 3. వాల్మీకి మహర్షి.

పూర్వకాలమున రత్నాకరుఁడను పేరుగలబ్రాహ్మణుఁ
డొకఁ డుండెడువాఁడు. ఆతఁడు నామమునకు మాత్రము
బ్రాహ్మణుఁడు. ఆతనికడ బ్రాహ్మణకృత్య మొక్కయును జూపట్ట
కుండెను. ఆతఁడు బాటసారులను దోచి ధనసంగ్రహణ మొనర్చి

తస్కారముగ జీవయాత్ర సలుపుకొనుచుండెడివాఁడు. వాని దుర్వర్తనమును గని పితామహుఁడు బ్రహ్మయు, దేవర్షి నారదుఁడును చింతిలుచు వానియెడ జాలిగొని వాని నుద్ధరింప నెంచి వానికడకు రాఁజొచ్చిరి. అట్లు తనకడ కభిముఖముగ నరుదెంచుచున్న యమ్మహనీయుల నిరువురఁ జూచి, రత్నాకరుఁడు వారలను వధించి వారికడనున్నసొత్తు నపహరింప మది నెంచి కాలదండముఁబోలిన దండము నొకదానిని జేకొని వారల కెదురేగఁజొచ్చెను. అట్లు ససంభ్రమముగ నగ్గరిలు చూడిన యాయుధమ బ్రాహ్మణునిఁ జూచి కమలజుఁడు, సవాత్సల్యముగ "రత్నాకరా! జగత్పూజ్యమగు బ్రహ్మకులమున జన్మమును బడసినవాఁడవు అట్టి నీవు ఇట్టిఘృణితమును నీచమును నగు క్రూరకర్మమును ఎందులకాచరించుచున్నవాఁడవు? అటులాచరించుటకు నీమన సెట్లొప్పెను? నీ వెవరిపోషణము నిమిత్త మిట్టి పాపకర్మ మాచరించుటకుఁ గడంగుచున్నవాఁడవో, వారు నీ యీపాపకర్మఫలానుభవమునందు భాగస్వాములగువారలగుదురని తలంచుచుంటివా ఏమి? అట్లెన్నఁడును దలంపకుము. ఎవరిపాలనముకొఱకు కొంకుజంకులు లేక నరహత్యలను గావించుచున్నాఁడవో వారు అందువలన లభ్యమగుఫలమునందు భాగస్థులు కానేరరు. నీ కలవడుపాపఫలమును నీవే యనుభవింపవలయును నీవొనర్చుపాపములకు ప్రతిఫలముగ పరలోకమందు ఎంతటి ఘోరకష్టముల ననుభవింపవలసియుండునో ఆవిషయమును గూర్చి యెన్నఁడైన నించుక విచారణ మొనర్చి చూచియున్నవాఁడవా; లేదు. చూచియుండినయెడల పాపభీతుఁడవై యుందువు. అది యటుల నుండనిమ్ము. నీవలన పోషింపఁబడువారు నీయొనర్చుకర్మలకు

లభ్యమగుఫలమును పంచుకొనెదరేమో? యడిగిరమ్ము" అని యాతనితో మందలించెను బ్రహ్మపలికినపలుకులు వీనులసోకి నంతనే రత్నాకరుఁడు చకితుఁడయ్యెను పాపభీతుఁడై యోజనాంబుధినోలలాడుచు 'ఎవరిపోషణముకొఱకు పాపకర్మముల నాచరించుచున్నాఁడనో, వారు తత్ఫలానుభవమున నేల భాగస్వాములుకారు' అనితనలోఁ దాననుకొనుచు తల్లిదండ్రులకడ కరిగి, "జననీజనకులారా! మీభరణపోషణమునకునై నేనొనర్చుకర్మలకు లభ్యమగుఫలము నాకొక్కనికే చెందునా? లేక, ఆఫలమునందు మీరుకూడ పాలుఁగొందురా? ఆసంగతిని వివరించి చెప్పుఁ"డని వారిని యడిగెను. అందుల కాతనితల్లిదండ్రులు, "వత్సా! నీయొనర్చుకర్మమునకు లభ్యమగుఫలము మంచిదైనను చెడ్డదైనను, అయ్యది నిన్నే పొందును మమ్మెంత మాత్రమును బొందనేరదు. ఆఫలమును నీవే యనుభవింప వలయును మే మెవరము ననుభవించువారము కాఁజాలము. జీవులెట్లు ఒక్కరొక్కరుగ జన్మమును గ్రహించుచున్న వారలో, యెట్లు ఒక్కరొక్కరుగ మరణమును బొందుచున్నవారలో అటులనే వారువారొనర్చు సుకృతదుష్కృతములకు లభ్యములగుసుఫలదుష్ఫలములనువారు వారొక్కరొక్కరుగనే యనుభవించువారలగుదురు తదన్యు లనుభవించువారలు గారు. నీవు బాలుఁడవై జీవననిర్వాహణమున కసమర్థుఁడవై యున్ననాఁడు నిన్ను పోషించితిమి. అయ్యది, అటులపోషించుట, మాకు కర్తవ్యము మాకుధర్మము మాకర్తవ్యధర్మమును మేమునిర్వహించుకొంటిమి. ఇపుడు నీవు పెద్దవాఁడవైతివి. ప్రాజ్ఞుఁడవైతివి. జీవననిర్వాహణమునకు సమర్థుఁడవైతివి. మేమన్ననో వృద్ధులమైతిమి. అసమర్థులమైతిమి. మమ్ముఁబోషించుట నీకుకర్తవ్యము. నీకుధర్మ

ము. మమ్ముఁ బోషించుచు, కర్తవ్యమును పరిపాలించుచు పిత్యాణా
మునుండి నీవు కష్టపడుచున్నాఁడవు. ఇంకేలకింతవిచారణ
మేటికి? అనవసరము కాని, చౌర్యమాదిగాఁగల దుష్కర్మముల
నాచరించి గొప్పపాపఫలమునకు పాత్రుఁడవగుచున్నాఁడవో,
ఆపాపఫలమును నీవొక్కఁడవే యనుభవింపవలసినవాఁడ
వనిమాత్రము గ్రహియింపుము. గ్రహియించి తదాచరణము
నకుఁ గడంగుము" అని యేకగ్రీవముగ బదులొసంగిరి. తల్లిదండ్రు
లొసంగిన ప్రత్యుత్తరమును బడసి రత్నాకరుఁడు నివ్వెఱఁగొని
వారికడనుండి వెడలి సహధర్మిణికడకరుదెంచి, "ప్రాణేశ్వరీ నే
నొనర్చు కర్మములకు సంప్రాప్తమగు ఫలమును నేనొక్కఁడనే
యనుభవింపవలయునా? లేక, నీవు, అర్ధాంగినిఁ గనుక నర్ధభాగ
మును గ్రహియించుదానవగుదువా? ఆలోచించి చెప్పుము." అని
యాతఁ డడిగెను. అందులకామె "ప్రాణనాథా! మీరొనర్చు
దుష్కృతముఫలమును మీరొక్కరే యనుభవింపవలయును.
నేనందలియంశమును అనుభవించుదానను గాను. వివాహకాల
మున ధర్మశపథమూని నన్ను భార్యగ గ్రహియించితిరి, గావున
మీరొనర్చు సుకృతముఫలమునం దర్ధభాగము అర్ధాంగినిని
గనుక నాకుఁ జెందఁగలదు. పతిపత్నులిరువురలో పతి పత్నిని
భరించు (పోషించు) వాఁడు గావున భర్త యనియును, పత్ని
పతివలన భరింపఁ (పోషింపఁ) బడునది గావున భార్య యనియును
బిలువఁబడుచున్నవారు. మీరు నాకు భర్తలు నేను మీకు
భార్యను. నన్ను పోషించుబాధ్యత మీయందుఁ గనుక నన్నే
విధముగనైనఁ బోషింపవలయును. అట్లని నాపోషణముకొఱకు
పాపకర్మ మొనర్చుఁడని మిమ్ముల నే నెన్నఁడును బురికొల్పిన
దానను గాను. మీ యిష్టముచొప్పున మీరొనర్చు పాపకర్మము

నకు ప్రాప్తమగు ఫలమునందు నేనెటుల భాగమును గొనుదాన నగుదును?" అని ప్రత్యుత్తరమొసఁగెను. జనకుఁడును, జననియును, పత్నియును నొసంగిన ప్రత్యుత్తరములు చెవిసోఁకి నంతనె రత్నాకరునిహృదయమున పాపభీతి జనియించెను. వైరాగ్య ముదయమయ్యెను. అంత నాతఁడు బ్రహ్మనారదు లున్నయెడకు పరుగుపరుగున జనుదెంచి వారిపదవనజములపై వ్రాలెను. పాపవిమోచనమున కుపాయముపదేశింపుఁడని కాతరుఁడై పదేపదే ప్రార్థింపఁజొచ్చెను. వానిపశ్చాత్తాపమును, వానిదైన్యమును, వానియధైర్యమును గని పద్మజుఁడు దయాళుఁడై వానికిధైర్యముగఱపి, రామమంత్రముపదేశించి,'వత్సా! ఈమంత్రరాజమును అనన్యచిత్తుఁడవై యనన్యభక్తుఁడవై నిరంతరమును జపయించుచుండుము. సూర్యతేజము తమోరాశిని రూపుమాపువిధమున, ఈమంత్రరాజము నీపాపసంచయమును రూపుమాపు. ఇఁక పాపచింతనమును వీడి తదేకధ్యానమున రామమంత్రజపమున కుద్యుక్తుఁడవుగమ్ము' అని బోధించెను. అంత రత్నాకరుఁడు రామనామమును జపియించుట యందు మనసుఁజొనిపి, స్థిరాసనుఁడై, గురూపదిష్టప్రకారమున మంత్రజపమున కుద్యుక్తుఁడై పలువిధముల ప్రయత్నమొనరించెను. కాని, వానిపాపము బలవత్తరమైయున్నందున వానినోటినుండి రామనామము వెలువడినది కాదయ్యె. అందువలన కమలజుఁడు రామశబ్దమును వర్ణవ్యత్యయమొనరించి 'మరా' యని జపియింపుమని వానికి బోధించెను అనంతరము రత్నాకరుఁడు, కమలజుఁడు బోధించినట్లు మరా, మరా యని జపింపఁజొచ్చెను. సద్గురుగణము శిష్యకోటికొసంగు కుండలినీప్రబోధన సమర్థమగుశక్తిప్రదానమే ప్రకృతమంత్ర

ము. అదియే సిద్ధమంత్రము. ఆమంత్రజపమే కుండలినీ ప్రబోధమునకు ప్రధానసాధనము. అతిరసంయుతమగుశబ్దము మంత్రముకాదు. అద్దానికి గుండలిని బోధించుశక్తి లేదు సద్గురు ప్రబోధమువలన బోధితమైనమంత్రమునందు మంత్రమూర్తి యగుభగవంతుఁడు, అద్వైతభావమున నిరంతరము వర్తమానుఁడై విరాజిల్లుచుండును. సద్గురూపదిష్టమైన మంత్ర(నామ)మెట్టిదైననేమి తత్సాధకులకు, తన్మంత్రమును జపియించు వారలకు తప్పక ముక్తి యలవడుననుటకు సంశయమావంతయును లేదు. సద్గురుఁడు కమలజుఁ డుపదేశించిన 'మర' మంత్రమును రత్నాకరుఁడు తదేకచిత్తమున జపియించుచు, కొలఁది దినములకు బాహ్యజ్ఞానశూన్యుఁ డయ్యెను. అతఁడు 'మరా' మంత్రజపమునందు ఎన్నిసంవత్సరములు గడచినవో గుర్తిడ నేరనంతటి తన్మయత్వమును బొందినవాఁడయ్యెను. కాలాంతరమున శ్రీరామచంద్రుని దర్శనమును బడసినవాఁడయ్యెను. శ్రీరామచంద్రదర్శనానంతరము దృఢసమాధియందు లీనుఁడయ్యెను. ఆతఁడు సమాధియందున్నకాలమున నాతని శరీరముపై చెదపురుగులు పుట్టలుపెట్టెను. అద్దాని నాతఁడు గుర్తిడ నేరకయుండెను. అంత చతురాననుఁడు, రత్నాకరుఁడున్నయెడ కరుదెంచి నలుదెసలఁ బాహ్యదృష్టిఁ బరికించిచూచి యాతనిఁ బొడఁగానకపోయెను. అనంతరము దివ్యదృష్టి నవలోకించి, శరీరముపై చెదపురుగులు, వల్మీకములు (పుట్టలు) పెట్టినను గ్రహియింపనేరనంతటి తన్మయత్వమున దృఢసమాధియందున్న వానిని రత్నాకరుని జూచి, యాతనిశరీరమును నలముకొనియున్న వల్మీకమును విదళించి యాతనిని సమాధిప్రబోధితునిఁ గావించెను. ఇట్లు సమాధ్యుద్బోధితుఁడైన రత్నాకరుఁడు,

కట్టెదుర నిలిచియున్న పరమారాధ్యుని, గురువర్యుని, బ్రహ్మను గని సభక్తికముగ సాష్టాంగనమస్కృతుల నర్పించి పరితృప్తునిఁ గావించెను. వానిభక్తివినయముల కలరి బ్రహ్మ వానికాశీస్సుల నొసంగుచు, "వత్సా! నీసాధకము సఫలమైనది. నీపాపము నశించినది. నీజన్మము సార్థకమైనది. నీవు దేవదుర్లభమగు ఋషిత్వమును బడసి జీవన్ముక్తుఁడవైతివి. వల్మీకస్థూపమునందుండి నూతనజన్మమును గ్రహియించినవాఁడవుగావున నింతటనుండి వాల్మీకి యనునామమునఁ బ్రఖ్యాతుఁడ వగుదువు" అని పలికి యంతర్హితుండయ్యెను.

మహర్షిపదవిఁబడసిన యనంతరము వాల్మీకి తమసానదీ తీరస్థమగు విధూపనామకస్థానమం దాశ్రమమేర్పఱచుకొని యందు నివసింపఁజొచ్చెను అనతికాలమున దేవర్షి నారదుఁ డా తపోవనమున కరుదెంచెను. అట్లరుదెంచిననారదుని వాల్మీకి యథావిధిఁ బూజించి యనంతరము, "ద్విజోత్తమా! ఋషిసత్తమా! మూఁడులోకములయందెందైన మీరుచూచినవారిలో గుణవంతుఁడు, విద్యావంతుఁడు, సత్యవ్రతుఁడు, దృఢవ్రతుఁడు, ప్రియదర్శనుఁడు, ధర్మపరాయణుఁడు, దయార్ద్రహృదయుఁడు, మహాపరాక్రమవంతుఁడు నగుమహనీయుఁ డొక్కఁడైనఁగలఁడా? కలఁడేని వానినామమును వివరింపుఁడు. వానిగుణములు గీర్తింపుఁడు వినుట కుత్సుకుఁడనై యున్నాఁడను" అని యాతనిఁ బ్రార్థించెను. వాల్మీకిప్రార్థన మాలించి నారదుఁడు, "అట్టిమనుజుఁడు జగత్తునందు దుర్లభుఁడు. అయినను, అయోధ్యాధిపతియగు శ్రీరామచంద్రునియందు నీనుడివిన గుణములన్నియును గలవు" అనిపలుకుచు రామచంద్రునిపవిత్ర చరిత్రమును వాల్మీకికి సంక్షేపముగ నెరిగించి యెందేని చని

నెను. వాల్మీకి నారదుఁడు వినిపించిన రామచరితమును మనన మొనరించుచు తమసానదికి స్నానమునకరిగెను. అతఁ డా సమయమున ప్రఫుల్లహృదయమున క్రీడానిమగ్నమై యొప్పి యున్న క్రౌంచమిథునమునందలి పురుషపక్షిని నిర్దయుఁడు వ్యాధుఁ డొక్కఁడు బాణమేయ, నది పుడమిఁగూలి విలవిలఁ దన్నుకొనుచు నెత్తురులఁ బొరలఁగనున్న దానిని, అట్లుగ్గనకఁ జూచి, కరుణయోగ జనితశోకానలజ్వాలామాలాసంతప్తచిత్తమై యతిదీనముగఁ గూయిడుచున్న యాఁడుపక్షినిఁ జూచి కరుణార్ద్రహృదయుఁడై, నిషా దునికెదురు మొగమై "మా నిషాద ప్రతిష్ఠాం త్వ మగమ శ్శాశ్వతీస్సమాః, యత్ క్రౌంచమిథునాదేక మవధీః కామమో హితమ్" "ఓ! నిషాదా! కామమోహమున సొంత తెలియంగక క్రీడించు క్రౌంచమిథునమందలి యొకదానిని నీ నిమిత్తేక; కావున నశాశ్వతముగు ప్రతిష్ఠఁగనువాఁడవగుదువు అనఁగా, దీర్ఘకాల ములో నశించువాఁడవగుదువుగాక!" యని పలికి వెంటనే, "ఈక్రౌంచిఁ జూచినంతనే నా డెందమున శోకము నన్నుఁ బీడింపఁగా సైపలేఁగక, యిదియేమి యిట్టులం జెప్పితిని" అనిచింతిల్లుచు తనయాశ్రమమునకుమరలి విధ్యుక్తకర్మాచరణమునందు మనసుఁ జొరఁజేసెను; కాని తనముఖమునందుండి యకస్మాత్తుగా నా లుగుపాదములనొప్పి ప్రతిపాదమందును సమానాక్షరసంఖ్యఁ గలిగి శ్లోకరూపమున వెలువడిన యాశాపవాక్యమునుగూర్చిన విచార మాతనిహృదయమును పీడించుచునే యుండెను. అంతఁ జతురాననుం డాతని హృదయపీడనమును బాపనెంచి యాతని కడ కరుదెంచెను. అట్లరుదెంచిన బ్రహ్మను సభక్తికముగ నర్చించి, ముకుళితకరకమలుఁడై విన్నవదనుఁడై యాతని కట్టెదుర నిలువఁబడియెను. అట్లు నిలిచిన కారణమేటిదని పృచ్ఛి

కర్త యెవరని ప్రశ్నించెను. అందులకు, బోయఁడొకఁడు మకులు మెల్లన నొప్పుచున్న క్రౌంచమిథునమునందలి మగపిట్టను ఆకారణము గాఁగూలనేసె, పోతుపిట్టకై మిక్కిలిదురపిల్లుచుఁ గనఁజాలిపొగులుచున్న యాఁడుపిట్టఁజూచినంతన పొడమినజాలి పెంపున తపంబునఁజెలువ నకస్మాత్తుగా తననోటినుండి శ్లోక రూపమగు శాపవాక్యమొండు వెలువడియె ననిపలుకుచు, నా వాక్యమును వినిచి, యీవాక్యము వెడలుటకు కారణమేటిదో గ్రహింపనేరనిచింతఁ దురపిల్లుచున్నాఁడను. నాచింతఁబాపి నన్ననుగ్రహింపుఁడని ప్రార్థించెను. వాల్మీకిప్రార్థనమాలించి, పద్మజుఁడు, “నానియోగమున సరస్వతి తనజిహ్వాగ్రముననిలిచి యీ వాక్యమును వెలువరించినదని యెఱుఁగకగదా యిట్లు చింతిల్లుచున్నవాఁడవు” అని తనలోఁ దాను నవ్వుకొనుచు, “ఋషివరా! నీవు విధిప్రేరణమున, ఛందోబద్ధమైనశ్లోకమును రచియించితివి. ఈశ్లోకమును అనుష్టుప్ అనియందురు. ఇదిశాపరూపమైనది కాదు. మంగళప్రదమైనది. దీనినిగూర్చి విచారింపకుము మంగళావతరణమగు నీశ్లోకమును నాందిగాఁగొని యిట్టిశ్లోకములతో శ్రీరామ చరితమును ప్రబంధరూపముగా రచియింపుము. రామచరితమునుగూర్చి దేవర్షి వలన వినియున్నవిషయముగాక, ఆతఁడెరిగింపని, రామకథసంబంధమైన రహస్యప్రకాశములైన విషయములన్నియును నీకు తేటతెల్లములగు. ఇక్కావ్యరచనమునకు నీవుసర్వసమర్థుఁడవు. నీవురచియించు నీకావ్యము దుష్టమును, అనృతమునుగాక, మనోహరంబై, సకలపాపహరంబై, పుణ్యప్రదంబై, ఆచంద్రార్కము, లోకప్రచారమునుగలదై యొప్పునది కాఁగలదు. నీరచియించిన రామాయణము ప్రచారమున నుండునంతకాలము ఎల్లలోకములయందు అప్రతిహతగతిని

చరించుచుండి యనంతరము నాలోకముచుబొంది, నాతోఁగూడ ముక్తిఁజెందువాఁడవగుదువు." అని యానతిచ్చి యచ్చటనే యంతర్హితుఁడయ్యె. అనంతరము మంగళార్థము మనంబున పరమాత్మను ధ్యానించి రామాయణమును రచియింప నుపక్రమించెను. వాల్మీకివిరచితమగు రామాయణము 'వాల్మీకిరామాయణ'మని పేరొందినది.

రావణవధానంతరము శ్రీరామచంద్రుఁడు పట్టాభిషిక్తుఁడై రాజ్యపాలనమొనర్చునెడ ప్రజారంజనమును బడయ నెంచి, నిరపరాధినియు గర్భవతియునగు సతీతిలకమును జనకనందినజానకిని త్యజించి, యామెను అరణ్యములో విడిచిరమ్మని లక్ష్మణుని కాజ్ఞయిచ్చెను. రామాజ్ఞ చొప్పున లక్ష్మణుఁడు జానకిని గొనిపోయి యరణ్యమునందు విడిచి స్వానయోధ్యకు చను వెంచెను. అట్లు పతిపరిత్యక్తయై నిస్సహాయముగ నరణ్యములో విలపించుచున్న జానకిని వాల్మీకి తనయాశ్రమమునకుఁ గొనిచని కన్నకూఁతుఁబోలెఁ బాలింపఁజొచ్చెను. మునిపాలితయగుజానకి యథాసమయమున లవకుశులనుపుత్రుల నిద్దఱఁ బ్రసవించెను. ఆబాలకులిద్దఱును సమయానుగుణముగఁ బెరిగి పెద్దవారలైరి. వారలకు వాల్మీకి క్షత్రియోచితముగ సంస్కారము లొనరించి విద్యాప్రదాన మొసంగెను. వారలు మహర్షి ప్రసాదమునకుఁ బాత్రులై, సకలవిద్యావిశారదులును, ధనుర్వేదపారగులును, వీరులును, పరాక్రమోపేతులును నై విరాజిలఁజొచ్చిరి. వారలకు వాల్మీకి తావిరచించిన రామాయణమును కంఠస్థమొనరింప, వారలు లోకమనోమోహనస్వరముతో రామచరితమును గానమొనరింపఁదొడంగిరి. ఆసమయమున శ్రీరామచంద్రుఁడు అశ్వమేధయాగమునుసలుప నారంభించెను. ఆయాగమునకు వాల్మీకి

నిమంత్రితుండై లవకుశులం దోడ్కొని అయోధ్యాపురికరిగెను. యజ్ఞస్థానమునకరుదెంచిన పిమ్మట నాయన్నదమ్ము లిరువురును తమ కోకిలకంఠములతో వాల్మీకివిరచిత రామాయణమును గానము చేయుచు నందందు తిరుగాడంజొచ్చిరి. వారిగానప్రశంసనము నగరమంతటను వ్యాప్తమై క్రమక్రమముగ శ్రీరామ చంద్రునికర్ణపుటముల నలంకరించెను అంత రాముండు ముదిత హృదయుండై వారలను రాజసభకు రావించెను రాజసభనలం కరించిన లవకుశుల నిరుపురం జూచినంతనె వారియెడ రామమా తకు కౌసల్యకు ప్రేమవాత్సల్యము లుదయమయ్యెను జానకి బ్రతికి పుత్రుని బ్రసవించియుండినచో, నాపుత్త్రుండును వీరియం తవాండయి యుండునుగదాయని విచారింపంజొచ్చెను. వారి గానవిద్యానైపుణ్యమును పరికించి సంతసిలుచు, రాముండా బాలురతల్లిదండ్రు లేరని వాల్మీకిం బ్రశ్నింప, నాతండు జానకీరామ చంద్రులని బదులొసంగెను మహర్షి పలుకుల నాలించినంతనె, రామునకును, రామపరివారమునకును గలిగినహర్షానందములు మేరమీఱిననయ్యెను. ప్రకృతపరిచయమునుబడసి లవకుశు లును ప్రసన్నహృదయులైరి అనంతరము వాల్మీకి లవకుశులను జానకిని శ్రీరామచంద్రునివశ మొనర్చి తాను తనతపోవనంబు నకు మరలం జనియెను.

---

## 4. విశ్వామిత్రమహర్షి.

కాన్యకుబ్జాధిపతి గాధిరాజునకు కొడుకులు లేరు. ఆత నికి సత్యవతియను నొక్కకూఁతురుగలదు. ఆతఁ డాకూఁతును ఋచీకమహాముని కొసంగి పరిణయ మొనరించెను. సత్యవతి పతి

వ్రత. ధర్మపరాయణ. పత్యనురాగమును నతిశయముగఁ బడ
సినయది. ఆమెయొకానొకదినమున పతిచెంతఁజేరి, వ్రీడావనత
వదనయై, 'ప్రాణనాథా! పుత్రప్రాప్తిఁబడయ నామనము వువ్విళ్లూరు
చున్నయది. కాఁబట్టి, యనుగ్రహించి ధార్మికపుత్రునిఁ బడయ
నగునుపాయమును బరికింపుఁడు. నాకే కాదు. పుత్రసంతతిలేక
పరితపించుచున్న నాతల్లిదండ్రులకుఁగూడ నొకపుత్రుని యను
గ్రహింపుఁడు' అని సభక్తికముగఁ బ్రార్థించెను. సతిప్రార్థన
నాలించి, ఋచీకుఁడు సంతుష్టాంతరంగుఁడై రెండు దివ్యచరు
వులను సిద్ధముచేసి, యందొకదానిని బ్రహ్మతేజముచేతను,
వేఱొకదానిని క్షాత్రతేజముచేతను బూరించి, భార్యఁజేరి, చరు
పాత్రములనొసంగుచు, 'నీపాత్రమందు బ్రహ్మతేజమును, నీపాత్ర
మందు క్షాత్రతేజమును సన్నివేశితములై యున్నయవి. బ్రహ్మ
తేజస్సన్నివేశితమైన చరువును నీవు భుజియింపుము. క్షాత్రతేజ
స్సన్నివేశితమైనచరువును నీజనని భుజింపఁజేయుము. దాన మీ
రుభయులును పుత్రలాభమును బడయువారలగుదు'రని చెప్పి
యామెను పనిచెను. సత్యవతియు, యాచరుపాత్రలరెండింటిని
భక్తిపూర్వకముగ గ్రహించి, యవ్వానిని జననికడకుఁగొనిచని,
తద్వివరణమెరిగించుచు తత్పాత్రల నామెచేతి కొసంగెను. అంత
సత్యవతిజనని, ఋచీకుఁడు సత్యవతికి తనభార్యకు అత్యుత్తమ
మైన చరువునవశ్యము నిర్మించియుండునని మదినెంచి, చరు
పాత్రలనుపరివర్తన మొనర్చి, క్షాత్రతేజస్సమన్వితమగు చరువును
కూఁతు భుజింపఁజేసి, బ్రహ్మతేజసమన్వితమగు దానిఁ దానుభుజిం
చెను. ఈపరివర్తనము ఋచీకున కవగతమగుడు, అతఁడు
భార్యఁ జేరి, 'కళ్యాణి! నీజనని చరుపాత్రలను పరివర్తన మొన
రించెను. అయ్యది యనుచితమైనది గావచ్చు. ఆపరివర్తనము

కారణముగ నీకుజనియించుపుత్త్రుఁడు క్షాత్త్రతేజస్సమన్వితుఁ డగు వాఁడును, నీజననికి జనియించుపుత్త్రుఁడు బ్రహ్మతేజస్సమన్వితుఁ డగు వాఁడునునగుదురు.' అని వివరించి చెప్పెను. అంత సత్యవతి కడుదుఃఖితయై, 'ప్రాణనాథా! నాపుత్త్రుఁడు క్షాత్త్రవంతుఁడు గాఁ వలదు. కాకతప్ప దేని నాపౌత్త్రుఁడగుఁగాత! అట్లనుగ్రహింపుఁ' డని పరిపరివిధముల భర్తను బ్రార్థింప, నాతఁ డలరుచు, నామె ప్రార్థనమంగీకరించి, "తథాస్తు"అని పలుకుచు నామెనూఱడించి పనిచెను. అనంతరము యథాసమయమున చరుగుణము ప్రకటితమయ్యెను. సత్యవతికి జమదగ్నియు, నామెజననికి విశ్వామిత్త్రుఁడును జనియించిరి. విశ్వామిత్త్రుఁడు శుక్లపక్షపాకరుని మాడ్కి దినదినాభివృద్ధిఁగనుచు కాలానుగుణముగ యథోచిత సంస్కారములఁ బడసి సకలవిద్యావిశారదుఁడును, ధనుర్వేద పారంగతుఁడును, సకలగుణసమన్వితుఁడును, పితృసింహాసన విరాజమానుండును నై ప్రజలను నిజప్రజలఁబోలెఁ బాలింపఁ జొచ్చెను.

విశ్వామిత్త్రుఁడు పితృసింహాసనారూఢుఁడై నయనంతర మొకనాఁడు మృగయావినోదియై యరణ్యమున కేగి యందందుఁ దిరుగాడుచు దైవికముగ వశిష్ఠతపోవనమున కరుదెంచెను. ఆతపోవనము శాంతభూయిష్ఠము. మనోహరము. సర్వగుణ సంపన్నము. సత్యలోకసదృశము. అట్టితపోవనముఁజూచి విశ్వామిత్త్రుఁడు ప్రహర్షచిత్తుఁడై వశిష్ఠసాక్షాత్కారమును బడయ నెంచి యాతనికడ కరిగి యాతనికి సాష్టాంగనమస్కృతుల నర్పించెను. వశిష్ఠుఁడును, విశ్వామిత్త్రుని సాదరపూర్వకముగ సత్కరించి, కూర్చుండఁజేసి, కుశలమారసి, 'గాధినందనా! నీవు నాకతిథి వై తివి. నాయొసంగు నాతిథ్యమును పరివారయుత

ముగ స్వీకరించి నేఁడిందు విశ్రామముఁ గనుము. ఇదినాకోరిక.' యని యతనితోఁబలికెను. విశ్వామిత్రుఁ డందుల కంగీకరించెను. అనంతరము, వసిష్ఠుఁడు, చిత్రవర్ణయు, లోకోత్తరగుణసంపన్నయు, నందినీనామ్నియు నగుతనహోమధేనువును రావించి, 'భద్రా! నేఁడు రాజును, రాజపరివారమును మనయాశ్రమమునకరుదెంచి మనకతిథులైనవారలు. వారలను యథోచితసత్కారముల సత్కరించి సంతుష్టులఁజేయుము. పొమ్ము.' అని యద్దాని కాదేశించెను. వసిష్ఠాదేశమును బడయుటతడవుగ నాయసాధారణశక్తిశాలిని నందిని, తనశరీరమునుండి షడ్రసయుక్తమగు పదార్థసంచయమును నుత్పన్నముగావించి, తత్కాలమున విశ్వామిత్రుని యాతనిపరివారమును పరితృప్తిఁబొందించెను. అంతవిశ్వామిత్రుఁడు కడు ప్రసన్నుఁడయ్యెను. అపూర్వశక్తిసంపన్న యగు నందినియెడ లోభచిత్తుఁడయ్యెను. అద్దానిఁ బడయనెంచి, వసిష్ఠుఁ జేరి 'బ్రహ్మర్షివర్యా! యీయలోకసామాన్య యగునందినియెడ నాకనురాగము మిక్కిలియయ్యెను. దానికిఁ బ్రతిగ లక్షగోవుల నొసంగెదను. వాని గ్రహించి నాకీనందిని నొసంగుఁడ'ని పరిపరివిధములఁ బ్రార్థించెను. నందిని నెడబాయుటవలన వసిష్ఠునకు కష్టము ఉత్కటమగు. ఆకారణమున నాతఁడు, 'రాజా' నాయొనర్చుయజ్ఞాది సమస్తధర్మకర్మములు నందినియధీనములు. నందినివినా యవిసాగవు. అందువలన త్రైలోక్యాధిపత్యము సంప్రాప్తమైనను నందిని నొసంగఁగలవాఁడనుగాను. అద్దాని నెడఁబాయఁజాలువాఁడను గాను' అని విశ్వామిత్రునకు బదులొసంగెను. అంత విశ్వామిత్రుఁడు, వసిష్ఠుఁడు సామమున నందిని నొసంగువాఁడు కాఁడని నిశ్చయించి, అద్దానిఁ బలాత్కారముగఁ గొని రాజధాని కరుగుఁడని తన

సైనికుల కాజ్ఞనొసంగెను. తదాజ్ఞానుసరణముగ సైనికు లెన్ని చేష్ట లొనరించినను, ఎన్ని ప్రయత్నములు చేసినను, వశిష్ఠుని హోమధేనువు ముందున కొక్కయడుగైనను పెట్టినదికాదు. అందువలన సైనికులు విసిగివిసిగి యద్దానిఁ బ్రహరింపఁజొచ్చిరి. దాన నయ్యది క్షతవిద్ధశరీరయై, దుఃఖాశ్రువుల వెలువరించుచు, దైన్యముఁబ్రకటించుచు,వశిష్ఠుముఖమును బరికింపఁదొడంగెను. నందినికలవడిన దుర్దశఁగని శోకాకులచిత్తుఁడై, గద్గదకంఠుఁడై, "నేనుక్షమాశీలుఁడను తపస్విని ఈదుష్టక్షత్రియుని దుర్వర్తన మునకు సహనమును జూపవలసినవాఁడను. ఈతనికడ నపారసైన్యబల ముపస్థితమైయున్నది. అద్దానిని నాశనమొనరించునట్టి తపోబలమునాకడనొప్పియున్న యది.కానియద్దానిననవసరముగ వ్యయమొనరించుటకు నామనస్సొప్పకున్న యది. కాఁబట్టినీసామర్థ్యమును బ్రకటించి యీక్షత్రియునిగర్వమును ఖర్వమొనరింపుము.' అని వశిష్ఠుఁడునుడివెను. అంతనందిని తనశరీరమునుండి యపారసైన్యమును నుత్పన్నమొనరించి యద్దానిని విశ్వామిత్ర సైన్యముఁ దలపడ నియోగించెను. అయ్యది సత్వరమున నరిగి విశ్వామిత్రునిసైనికులనేగాదు అతనిపుత్రులఁగూడ నాశన మొనరించెను. అంతట గాధినందనుఁడు హతదర్పితుఁడై, నిజ రాజధానికి మరలినవాఁడయ్యెను వశిష్ఠునివలన సంప్రాప్తమైన పరాభవ మాతనిహృదయమును వేధించుచుండినకతమున నాతఁడచిరకాలమున రాజ్యపరిత్యాగియై హిమవత్పర్వతప్రాంత మందు క్రూరమృగసంకులమగు నొకానొకయరణ్యమందు, వశిష్ఠనాశనాభిలాషి యై యీశ్వరుఁగూర్చి ఘోరతపముసలుప నారంభించెను. ఆతఁడొనర్చుతపంబునకు దేవదేవుఁడు, మహాదేవుఁడు ప్రసన్నుఁడై యాతనికిపలువిధము లగుదివ్యాస్త్రములు

నొసంగి కృతకృత్యుని గావించెను. ఈశ్వర ప్రసాదమునుబడసి మహోత్సుకుఁడై తపోవనమును వీడిచనుదెంచి వశిష్ఠునియాక్ర మించి, తాఁబడసినదివ్యాస్త్రముల నాతనిపైఁ బ్రయోగించెను. వశిష్ఠమహర్షి యాయస్త్రముల నన్నిఁటిని తనయోగదండమున వ్యర్థములుగఁ గావించెను. విశ్వామిత్రుఁడు తాను వశిష్ఠునిపైఁ బ్రయోగించిన అస్త్రము లాతనిశరీరమును స్పృశించుటకైన సమర్థములుగాక వమ్ములగుటఁ జూచి, క్షుభితుఁడై, క్షాత్ర బలమును ధిక్కరించుచు, బ్రహ్మతేజఃప్రభావమును బ్రశం సించుచు బ్రాహ్మణత్వమును బడయనెంచి ఘోరతపమొనర్చు టకు కృతనిశ్చయుఁడయ్యెను. పత్నీయుతముగ దక్షిణా పథమున కరిగి యందొకరమణీయస్థానమున నాశ్రమమును నిర్మించుకొనెను. ఆయాశ్రమమునం దాతనికి హవిష్పందుఁడు, మధుష్పందుఁడు, దృఢనేత్రుఁడు, మధురథుఁడు ననునలువురు పుత్త్రు లుదయించిరి

ఆకాలమున నయోధ్యానగరమును కల్మాషపాదుఁ డనురాజు పాలించుచుండెను. అతఁడొకానొకదినమున వేట తమకమున నరణ్యమునఁబరిభ్రమించుచుఁబిపాసాకులుఁడై జలా న్వేషణాతత్పరత్వమున నొకయిఱుకటపుమార్గమునఁ జనుచుం డెను. ఆమార్గమున నెదురుమనిషి తప్పుకొనుటకు తావులేదు. ఆసమయమున నాతనికెదురుగ వశిష్ఠపుత్త్రుఁడు విపులతపోధన సంపన్నుఁడు, ధర్మతత్పరుఁడు శక్తినామకుఁడు చనుదెంచుచుం డెను. అల్లెదురుగఁ జనుదెంచుచున్నశక్తిని మార్గమునువిడుము మని కల్మాషపాదుఁడునిర్బంధించెను. శక్తి తన్నట్లునిర్బంధించు రాజుఁజూచి, 'రాజా! రాజులు బ్రాహ్మణులకు తెరువిడవలయు నను సనాతననియమ మొండు గలదు. కాఁబట్టి తన్నియమాను

శరణముగ నీవే నాకు మార్గమిడవలయు'నని బదులు పల్కెను. శక్తితనమాటను మన్నింపమికి రాజు క్రుద్ధుడై యాతనిబదా ఘాతమునకు లోనుగావించెను. రాజుచేత పదతాడితుడైన శక్తి కుపితుడై, రాజుజేరి 'ధర్మాధర్మవివేచనావిదూరుడవై రాక్షసునిబోలె నన్ను పాదప్రహారమునకు గురిగావించితివి. కావున, నేడు మొదలుగ రాక్షసుడవై నరభోజివై కుత్సిత జీవనమునకు బాలగువాడవగుదువుగాత'మని యాతనికి శాపమొసంగి తనదారిం దాజనియెను. శక్తిశాపమునకు గురియైనకల్మాషపాదుడు రాక్షసాకారుడై సంచరింపదొడంగెను.

శక్తిశాపతప్తుడై కల్మాషపాదుడు రాక్షసాకారమున సంచరించుచున్నవాడనుసంగతి విశ్వామిత్రుని వీనులకెక్కెడు, ఆతడు కల్మాషపాదునికడ కరుదెంచి, యాతనినుత్తేజితునిగావించి యాతనిచేత శక్తిప్రభృతి వశిష్ఠపుత్రులను నూర్గురను జంపించి ప్రహర్షచిత్తుడయ్యెను. విశ్వామిత్రుని మూలమున నిట్టిఘోరకష్టమునకు బాల్పడినవాడయ్యును, క్షమాశీలుడు, శాంతచిత్తుడు నగువశిష్ఠుడు ఆతని కనిష్టమును సలిపినవాడు కాడయ్యెను. ఆతనిక్షమాశీలమును గని విశ్వామిత్రుడు పాశ్చర్యుడై, తనలోదాను, 'నాయొనర్చిన దుష్కర్మమునకు దగినప్రతిఫలమొసంగుటకు తగుసామర్థ్య మాతనికడ నొప్పియున్నను, నన్నేమియుం జేయక సహించి యూరకున్నవాడు. సహనశీలుడగు వశిష్ఠునకును, మత్సరగ్రస్తుడనగునాకును గలయంతరము దేవతలకును రాక్షసులకును గలయంతరముకన్న నతిశయముగ జూపట్టుచున్నయది' అని వితర్కింపజొచ్చెను. బ్రాహ్మణత్వమలవడుచుకొనినంగాని సహనశీల మలవడనేరదని నిశ్చయించెను. బ్రాహ్మణత్వమును

బడయనెంచి యుగ్రతపము సలుప నారంభించెను. ఆతఁడు సలుపునుగ్రతపమునకు ముల్లోకములును కలవరమొందుచుండుటఁ గని, బ్రహ్మాదిశ్వాలసహితముగ నరుదెంచి రాజర్షిపదవి యనుగ్రహించి చనియెను.

ఆకాలమున ఇక్ష్వాకువంశజుఁడు త్రిశంకుఁడు, వశిష్ఠునికడకేగి 'సశరీరముగ స్వర్గపదమలవరచుయజ్ఞము నాచేఁ జేయింపుఁ'డని యాతనిఁబ్రార్థించెను. త్రిశంకునిప్రార్థన మసంగతమని తలంచి వశిష్ఠుఁ 'డట్టియజ్ఞమును నేఁ జేయింపఁజాల'నని చెప్పి యాతని వెడలనడచెను. అయ్యుదంతము విశ్వామిత్రునికవగతమగుడు, వశిష్ఠుని నవమానితునిగఁ జేయవలయునను తలంపుతో, ఆతఁడు త్రిశంకుని కడకేగి, 'సశరీరముగ స్వర్గమునుబొందించునట్టి యజ్ఞమును నేఁ జేయించెద'నని చెప్పుచు నాతనిచే బృహద్యాగమొండు చేయించెను. కాని, త్రిశంకుని దేవలోకమును బొందింప నేరక, యాతనివాయుపథమున నిలువరించి, యాతఁడు నిలిచినస్థానమునకు 'త్రిశంకుస్వర్గ'మని పేరిడియెను.

త్రిశంకునిస్వర్గధామమును బొందింపనేరనందులకు చింతిల్లుచు విశ్వామిత్రుఁడు, పవిత్రతమమగు పుష్కరతీర్థమునకరిగి నిష్ఠురతపోనిమగ్నతఁ దగిలియుండ మరల బ్రహ్మ ప్రత్యక్షమై ఋషిపదవియనుగ్రహించి చనియెను. బ్రాహ్మణత్వమును బడయనెంచినవాఁడగుటకారణముగ నాతఁడు బ్రహ్మప్రదత్తమగు ఋషిపదవితో సంతుష్టినొందనేరక యథాపూర్వముగ తపోనిమగ్నతఁదగిలియుండెను. అట్లు విశ్వామిత్రుఁడు తపోనిరతుఁడై యొప్పియున్నకాలమం దొకనాఁడు అప్సరస మేనకను, పుష్కరతీర్థస్నానమున కరుదెంచిన దానినిఁ జూచి, కామవివశుఁడై,

తపంపుపెంపు బోనడచి యామెను తనయాశ్రమమునం దునిచి కొని, యామెతోడి క్రీడావిహారములం బ్రొద్దులుపుచ్చుచుండం గెను. ఈవిధముగ విశ్వామిత్రతపంబునకు విఘ్నమొం డాపాదించెను. కాలాంతరమున మేనక గర్భవతియయ్యెను. విశ్వామిత్రుడు చింతాకులస్వాంతుం డయ్యెను. క్షుబ్ధుండయ్యెను. ఆతనిమనోవైకల్యముంగని మేనక భయకంపితయయ్యెను. విశ్వామిత్రుం డామెకు ధైర్యముంగఱపి యెం దేని జనుమని యాదేశించెను. అంత గర్భవతియగు మేనక విశ్వామిత్రాశ్రమమును వీడి హిమాలయపార్శ్వవాహినియగు మాలినీనదీతీరమున కరిగి ప్రఫుల్లకమలినీసదృశసుందరియగు కన్యకం బ్రసవించి యాశిశువు నందు దిగవిడిచి స్వర్లోకమును బొందెను. అట్లు జననీపరిత్యక్తయగుశిశువును శకుంతములు (పక్షులు) సంరక్షింపసాగెను. శకుంతరక్షణమునం బెరుగుచున్న బాలికను కణ్వమహర్షి తన యాశ్రమమునకుం గొనిపోయి నిజపుత్రికం బోలెం బాలింపం దొడంగెను. శకుంతరక్షణమును బడసినదగుటకారణముగ నామెకు శకుంతల యని నామకరణము చేసెను. ఈశకుంతలయే కాలాంతరమున రాజర్షి దుష్యంతునిబరిణయమై, రాజచక్రవర్తి భరతుని గనియెను. ఆభరతునిపరిపాలనమున రాజిల్లినకతము వనే జంబూద్వీపమునకు భరతఖండమనునామ మలవడియెను.

మేనకను విడిచిపుచ్చిన యనంతరము విశ్వామిత్రుండు పుష్కరతీర్థస్థాశ్రమమును వీడి కౌశికీతీరమున కరిగి యందు నాశ్రమమును నిర్మించుకొని నిష్ఠురతపోనిమగ్నుండై కామప్రవృత్తిం దమనమొనర్చెను. ఆతనితపంబునకు మెచ్చి బ్రహ్మ మరలసాక్షాత్కరించి యాతనికి మహర్షిపదవి ననుగ్రహించెను. అట్లు ప్రసన్నుండైన ప్రజాపతికి విశ్వామిత్రుం డభివాదన మొనర్చి

యనంతరమాతని, 'దేవాదిదేవా! సదాచారసంపత్తికి, క్షమాశీలతకును, భూతదయాళుత్వమునకును నిలయమైన బ్రాహ్మణత్వమును ఆశించుచున్నాఁడను. కరుణించి యనుగ్రహింపుఁడు.' అని భక్తివినయములతోఁ బ్రార్థించెను. అందులకు బ్రహ్మ, 'వత్సా! కారణము కలిగినప్పుడైనను నీచిత్తము వికారాయత్తము కాకుండ నెప్పుడుండునో అప్పుడు జితేంద్రియుఁడవగుదువు. జితేంద్రియత్వమును బడయుటకు ప్రాణపణముగ ప్రయత్నమొనరింపుము. దానఁ గృతార్థుఁడవగుదువు.' అని యాతనికి బోధించి యందుండి తిరోధానుఁ డయ్యెను. అనంతరము విశ్వామిత్రుఁ డూర్ధ్వబాహుఁ డై, వాయుభక్షుఁ డై, వేసవియందు పంచాగ్నిమధ్యమునను, వర్షాకాలమునందు బహిఃప్రదేశమునను, శీతకాలమందు జలమధ్యమునను నిలిచి చిరకాలము ఘోరతప మొనరింపఁజొచ్చెను. అంతట దేవేంద్రుఁడు, పరీక్షార్థము, పరమరూపవతి రంభ నాతనికడ కనిపెను. ఆతఁ డింద్రునిచతురత గ్రహియించి, రంభవర్తనమునకుఁ గినిసి యామెను శాపదగ్ధఁ గావించెను. పిమ్మట క్రోధోద్రేకమున నొడలెఱుంగక వెనుకముందులాలోచింపక రంభను శపించి తపంబును వ్యర్థపుచ్చినందులకు పశ్చాత్తాపతప్తుఁడై, యిఁకముందెన్నఁడును క్రోధమూనుట, శాపవాక్కుల నుచ్చరించుట మొదలుగాఁగల తపోవిఘ్నదములగు వర్తనములందు చిత్తము చొరనీకుండ బంధించి, కుంభకయోగమున నింద్రియనిరోధ మొనరించి బ్రాహ్మణత్వమును బడయునంతదనుక నూపిరినైన విడుచువాఁడను గానని దృఢప్రతిజ్ఞుఁడై యథాపూర్వముగ నిష్ఠురతపోనిరతుఁడై యచిరకాలములో మనోవృత్తులను విధ్వంసమొనరించి, నిశ్చలుఁడును, నిష్క్రియుఁడును నయ్యెను. అందువలన నాతనికి

సంకల్పవికల్పములు పూర్ణరూపముగ వినష్టమైనవయ్యెను. ఇంద్రియవిజయ మలవడియెను. అంత నింద్రాదిదేవతలు పితామహునికడ కరిగి, 'దేవా! విశ్వామిత్రుని పలువిధములఁ బరీక్షించి చూచితిమి. ఆతనికడ కామక్రోధాదు లిసుమంతయుఁ జూపట్టుట లేదు. ఆతనిపాపములును విషయవాసనలును సంపూర్ణముగ భస్మములయ్యెను.' అని యాతనికి వినిచిరి. విశ్వామిత్రుఁడు విజితేంద్రియుఁడైనవాఁడని యింద్రాదిదేవతలవలన నాలించి సరస్వతీపతి సంతోషతరంగితాంతరంగుఁడై యాతనికడ కరుదెంచి యాతనికి బ్రాహ్మణత్వమును బ్రసాదించెను. బ్రాహ్మణత్వమును బడసినంతనె విశ్వామిత్రుఁడు పితామహునకు సాష్టాంగనమస్కృతుల నర్పించి, యాతని, 'దేవాదిదేవా! నాకు బ్రాహ్మణత్వము ననుగ్రహించినవారలు గనుక నన్ను వేదవిదునిగఁ గూడఁ జేయుఁడు. ధన్యుఁడ నగుదును. నాజన్మము సార్థకము జెందును. నాయపరాధములను క్షమించి నన్ను వశిష్ఠమహర్షి, బ్రహ్మర్షియని సంబోధించునటుల చేయుఁడు. ఈనా కోరికలు సఫలములు కాఁజాలవని తోఁచినయెడల నాకు యథాపూర్వకముగ తపంబుసలుపుట కాజ్ఞ దయచేయుఁడు.' అని సవినయ భయభక్తులతోఁ బ్రార్థించెను. సృష్టికర్త యాతని భక్తివినయములకలరి యాతనికోరికలీడేరునటు లనుగ్రహించి యందుండి వెడలిపోయెను. ఇట్లు విశ్వామిత్రుఁడు ఘోరతపంబున విరించి నలరించి యాతనివలన బ్రాహ్మణత్వమును, వేదవిజ్ఞానమును బడసి వశిష్ఠునివలన బ్రహ్మర్షియని సంబోధితుఁడై నిజాశ్రమమున సుఖపూర్వకముగ నివసింపఁదొడంగెను

విశ్వామిత్రాశ్రమమునకు సమీపస్థమగు నరణ్యములో తాటకియనుఘోరరాక్షసి నివసించుచు, తపోవనస్థు లొనర్చు

యజ్ఞాదికర్మములను విధ్వంసములు గావించుచుండెను. ఆమె యొనర్చు నీదుష్కృత్యమునందు ఆమెపుత్రులు సుబాహుమారీచులనువార లిరువురు సహచరులై యొప్పుచుండెడివారు. మహర్షులొనర్చు యజ్ఞాదికర్మములను పుత్రసహచరియగు తాటకి విధ్వంసమొనరించుచుండుటఁ గని, విశ్వామిత్రుఁడు చింతితుఁడై, దుష్టశిక్షణ యజ్ఞరక్షణార్థ మయోధ్యనుండి దశరథపుత్రులను రామలక్ష్మణులను వెంటఁ దోడ్కొనితెచ్చి, వారలకు మార్గమధ్యమున, నాయాసాపజయములను దూరమొనర్పఁగల 'బలాతిబల'లను విద్యల నుపదేశించెను. విశ్వామిత్రుని వెనువెంటఁజనుదెంచుచున్న రామలక్ష్మణులను జూచినంతనే తాటకి కుపితయై వారలను భక్షింప నెదురేగఁజొచ్చెను. క్షణకాలమున నెదురేగుదెంచుచున్న తాటకిని రామునిచేత చంపించెను. అనంతరమాశ్రమమునకరుదెంచి యజ్ఞదీక్షితుఁడయ్యెను. విశ్వామిత్రుని యజ్ఞోదంత మాలించి, యద్దానిని విధ్వంసమొనరించుటకునై సుబాహుమారీచు లరుదెంచి యజ్ఞకుండములపై రక్తమాంసాదులను విసరఁజొచ్చిరి అంత యజ్ఞరక్షకుఁడు రాముఁడు సుబాహుని సంహరించి, మారీచుని సముద్రములోఁ బాఱవైచి యజ్ఞమును నిర్విఘ్నముగ పరిసమాప్తిఁబొందించెను. ఇట్లు యజ్ఞమును నిర్విఘ్నపరిసమాప్తిఁ గనఁజేసిన రామలక్ష్మణుల యెడ విశ్వామిత్రుఁడు ప్రసన్నుఁడై వారలకు పురశ్చరణపూర్వకముగ దివ్యాస్త్రములనేకము లొసంగెను.

విశ్వామిత్రుఁడు రాజర్షి జనకరాజనిమంత్రితుఁడై రామలక్ష్మణులతో మిథిలానగరమున కేగుచు, మార్గమధ్యమున గౌతమమున్యాశ్రమమున కరుదెంచి యందు శాపదగ్ధయై పాషాణరూపమునఁ బడియున్న గౌతమపత్నిని, అహల్యను,

రాముని చేత శాపవిముక్తఁ గావించి జనక రాజపురముఁ జేరెను. అట్లు చను దెంచినమహర్షికి జనకుఁడు కులపురోహితుఁడు శతానందపురస్సరముగ నదురేగి స్వాగతమొసంగి యాతని రాజమందిరమునకుఁ దోడొ్కనివచ్చి యథావిహితముగ పూజాదికృత్యములఁ బరితుష్టునిఁ గావించి, పార్శ్వవర్తులగు రామలక్ష్మణులఁ దిలకించి, మునిచంద్రమా! అసితూణశరాసనధారులై సింహకిశోరములచందమున నలరారుచున్న యీబాలకులతల్లిదండ్రు లేరో యెఱిఁగించి నన్ను ధన్యునిగఁ జేయుఁడని ప్రార్థించెను. అంత నాతఁడు రామలక్ష్మణులచరితమాద్యంతము జనకున కెరిగించి, 'నీయింటనున్న శివునివిల్లును ఈరామునకుఁ జూపు' మని యాదేశించెను. మహర్షి యాదేశానుసరణముగ జనకుఁడు, రామునకు శివధనుస్సును జూపుచు, 'దీనిని మోపెట్టు దేని నాకూఁతును, అలోకసామాన్యసుందరిని, సీతను నీకిచ్చి వివాహము చేయుదును' అనిపలికెను. విశ్వామిత్రునియనుమతిఁ బడసి రాముఁడు ధనుస్సును గ్రహియించి యెక్కిడుటకుద్యమింప, నయ్యది నడిమికి రెండుతునుకలయ్యెను. శివునివిల్లెక్కిడునట్టిగాని, విఱచునట్టిగాని వ్యక్తికి తనపుత్రికను సీతనిచ్చి వివాహము చేయుటకు జనకుఁడు ప్రతినఁబూని యున్నవాఁడు. తత్ప్రకారము విశ్వామిత్రానుమతిని జనకుఁడు, రామునకు సీతను, లక్ష్మణునకు తనరెండవకూఁతునూర్మిళను, భరతశత్రుఘ్నులకు తనసోదరపుత్రికలు మాండవీశ్రుతకీర్తుల నొసంగి పరిణయ మొనర్చెను. పరిణయానంతరము, సంతోషపూర్వకముగ, విశ్వామిత్రుఁడు సిద్ధాశ్రమమునకును, రామలక్ష్మణప్రభృతులు అయోధ్యకును మరలినవారలైరి.

విశ్వామిత్రమహర్షి, అయోధ్యాధిపుఁడు, సత్యసంధుఁడు, హరిశ్చంద్రునిరాజ్యమును సర్వస్వమును గ్రహించి, యంతకుమున్నాతఁడొసంగెదనన్న యజ్ఞదక్షిణకు, ఆతనిఁ గాటికాపరికిని, ఆతనిభార్యను చంద్రమతిని, పుత్రుని లోహితాస్యుని నొకబ్రాహ్మణునకును విక్రయించి, పలుకష్టములపాలు గావించి, యాతనిసత్యవ్రతమును లోకవిఖ్యాత మొనరించి, యాతనికి శాశ్వతయశమును సమకూర్చినవాఁడు.



## 5. వేదవ్యాసమహర్షి.

వేదవ్యాసుఁడు శ్రీమన్నారాయణావతారుఁడుగ పరిగణింపఁబడుచున్నవాఁడు. ఆతనితండ్రి పరాశరుఁడు తాత శక్తి. ముత్తాత బ్రహ్మర్షివరిష్ఠుఁడు వశిష్ఠుఁడు. తల్లి మత్స్యోదరియను విదుషీరత్నము. మత్స్యోదరికి యోజనగంధి, సత్యవతియను మఱి రెండునామములు గలవు. వేదవ్యాసుఁడు కృష్ణవర్ణుఁడగుట కారణముగ కృష్ణుఁడనియు, నదీమధ్యమున ద్వీపమందు జన్మించిన వాఁడగుటవలన ద్వైపాయనుఁడనియును పేర్కొనఁబడుచున్న వాఁడు. వేదవిభాగ మొనర్చిన కారణమున వేదవ్యాసనామమున విఖ్యాతుఁడయ్యెను చిరకాలము బదరీవనమునఁ దపంబుసలిపి యున్న కారణమున బాదరాయణుఁడనిగూడఁ బేరొందినవాఁడు. మహర్షిమండలమునందు ప్రథమగణ్యుఁడు. విద్యలకు అపరసరస్వతి. ప్రత్యక్షమూర్తి. పదునెనిమిది మహాపురాణములు, పదునెనిమిది యుపపురాణములు, వ్యాసస్మృతి, బ్రహ్మసూత్రములు ఉత్తరమీమాంస, మహాభారతమును, అధ్యాత్మరామాయ

ణము, ఆదిగాఁగల బహుసంఖ్యాకములగు గ్రంథరత్నములను, పాతంజలియోగసూత్రములకు వ్యాఖ్యను రచియించి, తత్కాంతి పుంజములచేత, పుణ్యప్రదమగు భారతభూమి ప్రాచీనగుణ గరిమ నుత్తరోత్తరాభివృద్ధిగ వెలుఁగొందఁజేసెను. ఆతఁడు జన్మగ్రహణమొనర్చిన వెనువెంటనే, జననియగుసత్యవతికి ధర్మో పదేశమొసంగి, "నన్నునెప్పుడు తలంచెదవో, అప్పుడు, ఆక్షణ మున నీసమ్ముఖమున నుపస్థితుఁడనగుదు"నని యామెకడ కృత ప్రతిజ్ఞుఁడై, తపంబొనర్పుట కెందేని చనియెను.

ఆకాలమున, భరతవంశజుఁడు, శంతనుఁడు, హస్తినా పురమును బాలించుచుండెను. ఆతనికి గంగవలన భీష్ముఁడను కొమరుఁడు గలిగెను. భీష్ముఁ డుదయించినపిమ్మట కారణాంతర మున గంగ శంతనుని వీడి వెడలిపోయెను. కాలాంతరమున భీష్ముఁడు యువరాజపట్టభద్రుఁడయ్యెను. పిమ్మట భీష్ముఁడు రాజ్యాధికారమును పరిత్యజించి, ఆజన్మబ్రహ్మచర్యవ్రతమును గ్రహియించి తనజనకునకు శంతనునకు సత్యవతిని బరిణయ మొనరించెను. శంతనుఁడు సత్యవతియందు చిత్రాంగదుఁడు, విచిత్రవీర్యుఁడు ననునిరువురు కొమరులఁబడసి స్వర్గస్థుఁడయ్యెను. చిత్రాంగదుఁడు అవివాహితుఁడుగనె పరలోకగతుఁడయ్యెను. విచిత్రవీర్యుఁడు అంబిక, అంబాలికలను నిరువురుసతులను, అనా థయువతులుగ నొనరించి తాను స్వర్లోకమును జూఱఁగొని యెను. అట్లు కురువంశము నష్టప్రాయమగుఁడు, జనని, సత్యవతి యాజ్ఞఁజొప్పున, వేదవ్యాసుఁడు తనయోగశక్తివలన, అంబిక యందు ధృతరాష్ట్రుని, అంబాలికయందు పాండురాజును, అంబికాదాసియందు భక్తప్రవరుని విదురుని నుత్పన్నులఁ గావించి కురుకులమును పునరుజ్జీవితమును గావించెను.

వ్యాసుఁడు, దుర్యోధనయుధిష్ఠిరులకు ప్రవర్తిల్లినమహాభారత యుద్ధసమయమునందు, ధృతరాష్ట్రదుర్యోధనాదులకు సదుపదేశ మొసంగుచు పాండుపుత్త్రుల కర్ధరాజ్య మొసంగి కురుకులరక్షణ మొనరింపుఁడని బోధించెను. వ్యాసవరప్రభావమువలననే భారతయుద్ధమందు సంఘటిల్లినగుప్తఘటనలను గూడ నిత్యమును ధృతరాష్ట్రున కెఱింగించుటకు సంజయుఁడు సమర్థుఁడయ్యెను. అర్జునపుత్త్రుఁడు, మహావీరుఁడు నగునభిమన్యుఁడు నిహతుఁడై నపిమ్మట, షోడశమహారాజులయు, రాజపుత్త్రులయొక్కయు కథలను వినిచి ధర్మరాజును దుఃఖోపశాంతునిగఁ జేసెను. ఆకథలు శోకాకులచిత్తులకు దుఃఖోపశమనములు. ఆనందవములు. వైరాగ్యదములు. భారతవీరుఁడు అర్జునునకును, గురుపుత్త్రుఁడు అశ్వత్థామకును ద్రౌపదేయవధానంతరమున ప్రవర్తిల్లినమహాయుద్ధమందు నావీరులిరువురు నొండొరులపైఁ బ్రయోగించుకొనిన బ్రహ్మశిరోనామకాస్త్రములనడుమ యోగబలమున నుపస్థితుఁడై, తదస్త్రములకు బలి కాకుండ నాయిరువురవీరులనేగాక సమస్తప్రపంచమునుగూడ సంరక్షించెను భారతయుద్ధానంతరమున, ధృతరాష్ట్రయుధిష్ఠిరులకును, కుంతిగాంధారిప్రభృతి శోకవిహ్వలలగు కౌరవవనితలకును ననుగ్రహించిన యుపదేశములు నేఁడును సకలజనులకు పరమోపాదేయములై విరాజిలుచున్నయవి. ధృతరాష్ట్రుఁడు, పుత్త్రశోకమువలన నధీరుఁడై పడియుండినపుడు, తన యోగబలము చేత దుర్యోధనాదులయాత్మలనుస్వర్గమునందుండి ధరాతలమునకు రావించి యాతనికిఁ జూపి, యాతనిశోకమును దూరగత మొనరించెను. శ్రీకృష్ణనిర్యాణానంతరము పాండవులకు దివ్యోపదేశ మొసంగెను ఆయుపదేశమువలన వారలు

మోహావిదూరులై స్వర్గయాత్రకు ప్రస్థానము చేసిరి. వ్యాస మహర్షి జగత్కల్యాణమభిలషించి, కాలానుగుణముగ సామయిక రాజమహారాజులకును ప్రజలకు నొసంగిన సదుపదేశములతో ఆర్షగ్రంథములన్నియును నిండియున్నయవి.

పుణ్యభూమియగు భరతఖండమున కలంకారసదృశులగుఋషులు, మహర్షులు, రాజులు, మహారాజులు, చక్రవర్తులు పలువురు గలరు. కాని వారలలో వేదవ్యాసునిఁ బోలు లోకోపకారపారీణు లొక్కరైనఁజూపట్టరు. ఆతఁడు రచియించిన గ్రంథములు ఆర్యవాణి కమూల్యాభరణములు. సంస్కృత సాహిత్యభిత్తిప్రతిష్ఠాపనమునకు ప్రధానసాధనములు. ధర్మప్రబోధమునకు సద్గురుసదృశములు. సనాతనధర్మాస్తిత్వమునకు ముఖ్యకారణములు బ్రహ్మసూత్రములు మతాంతరులచే సర్వసమ్మతములుగ పరిగణింపఁబడుచున్నయవి. మహాభారతము ఇతిహాసముగను, పురాణముగను, కావ్యముగను, నీతిశాస్త్రముగను, ధర్మగ్రంథముగను కొనియాడఁబడుచున్నయవి. అందు వేదాంతబ్రహ్మవిద్యాదివిషయములు పెక్కులిమిడియున్నయవి. అందలి భగవద్గీతఁబోలిన కర్తవ్యోపదేశక బ్రహ్మసత్తానిరూపక గ్రంథము మఱియొకటి గానరాదు. ఆతఁ డుద్ధరించినయుద్యోగపర్వములోని భగవద్వాక్యము ఆతనిబుద్ధికుశలతను బహుతరముగఁ గొనియాడుచున్నయది. దివ్యపురుషుని శ్రీరామచంద్రుని పుణ్యచరిత్రప్రచారమునకు వాల్మీకిరామాయణము కారణమైనవిధమున యోగివర్యుని శ్రీకృష్ణచంద్రుని పావనచరిత్రప్రచారమునకు భాగవతబ్రహ్మవైవర్తపురాణములు కారణములై యున్నయవి. వ్యాసవిరచితమగు భాగవతదివ్యపురాణ

మునే, అభిమన్యుతనయుండు పరీక్షిత్తు శుకమహర్షి వలన నేడు దినములలో నాలించి పరమపదముం జూఱఁగొనియెను.

వ్యాసమహర్షి తాను రచియించిన గ్రంథముల నొకమూల నిడిపూజింపక, తత్ప్రచారమును గూర్చి యథేష్టోద్యోగ మొనర్చి యున్నవాఁడు. ఆతనికడ ననంఖ్యాకులగు శిష్యులు అధ్యయన మొనర్చుచుండెడివారు. ఆశిష్యుల కాతఁడు తా రచియించిన గ్రంథములను వెంటవెంటనే కంఠస్థమొనరించి వానిని పవిత్ర క్షేత్రముల కరిగి ప్రచారమును సలిపి తన్మూలముగ జగత్కళ్యాణ మొనఁగూర్పుఁడని వారల నియోగించుచుండెడివాఁడు. వ్యాసశిష్యులలో వైశంపాయనుఁడు, భారతమును జనమేజయునకు సర్పయాగసభాసదనమున వినిపించి కీర్తిఁబడసెను. శుకుఁడు భాగవతమును పరీక్షిత్తునకు వినిచి కృతార్థుఁడయ్యెను. సూతుఁడు తదితరపురాణములను నైమిశారణ్యాదిపుణ్యక్షేత్రములయందు సహస్రసంఖ్యాకులగు మహర్షులసమ్ముఖమున కథారూపమున వినిచి జీవన్ముక్తుఁడయ్యెను. గౌతమాదులు వేదశాస్త్ర బ్రహ్మవిద్యాదివిషయములను ప్రచార మొనరించి యశఃకాయులైరి. పురాణములన్నియును వేదవ్యాసవిరచితము లగుటకారణముగ తత్పురాణకథకులు ప్రకృతకాలమందు కూడ వ్యాసనామమునఁ బేర్కొనఁబడుచున్నవారలు.

వ్యాసమహర్షి యనేక గ్రంథములను సంకలన మొనర్చుటయందు సర్వసమర్థుఁడైనవాఁడైనను, దుర్భేద్యమగు సంసారవ్యామోహమును విచ్ఛిన్న మొనరించుటయం దశక్తుఁడై, మనశ్శాంతిని బడయనేరక పరితపింపఁజొచ్చెను. అట్టితరి దేవర్షి నారదుఁ డాతనికడ కరుదెంచి, 'యాతనికి పరమపవిత్రమగు

శ్లోకచతుష్టయమును వినిచి యెందేని చనియెను. నారదుండు వినిచిన శ్లోకచతుష్టయమును నాధారముగఁగొని వ్యాసమహర్షి పవిత్రతమమును, పుణ్యప్రదమునునగు శ్రీమద్భాగవతమును రచియించి మనశ్శాంతిఁ జూఱఁగొనియెను.

---

## 6. యాజ్ఞవల్క్యమహర్షి.

యాజ్ఞవల్క్యుఁడు మహర్షిశ్రేష్ఠులలో నొక్కరుఁడుగ పరిగణింపఁబడినవాఁడు. మహాభిమానుఁడు త్రికాలజ్ఞుఁడు. వేదశాస్త్రపారంగతుఁడు. యోగవిదుఁడు, బ్రహ్మజ్ఞానోపదేశకుఁడు. స్మృతిగ్రంథమును యోగశాస్త్రమును విరచించినవాఁడు. ఈశ్వరసాక్షాత్కారమును బడసినవాఁడు. అమరత్వమును జూఱఁగొనినవాఁడు. ఆతనితపోవనము మిథిలలో నొప్పుచుండెడిది. మిథిలాధిపతి, రాజర్షి జనకమహారాజు పాలనకాలమునం దుండినవాఁడు. జనకచక్రవర్తికిని సహధర్మిణి మైత్రేయికిని బ్రహ్మజ్ఞానవిషయమునుగూర్చి బహుతరముగ నుపదేశ మొసంగియున్నవాఁడు ఆయుపదేశవివరణము బృహదారణ్యకోపనిషత్తునందు విపులముగ వివరింపఁబడియున్న యది.

ఒకప్పుడు జనకుఁ డొక బృహద్యాగమును సలిపెను. ఆసమయమున కురుపాంచాలాది దేశములలోని విద్వాంసులు, బ్రహ్మవిదులు, బ్రాహ్మణులు పలువురు నిమంత్రితులై యరుదెంచి యాయజ్ఞవాటికయం దుపస్థితులైరి. అట్లు బ్రహ్మవిదులు, బ్రాహ్మణులు అందఱు నొక్కచో నుండఁగా జనకుఁడు ఆనందభరితుఁడై, వారలనందఱిని యథావిధిఁ బూజించి,

"భూదేవులారా! బ్రహ్మనిష్ఠుఁడగు బ్రాహ్మణునకు సవత్సకము, స్వర్ణశృంగమండితము నగు గోసహస్రమును బహుమానపూర్వకముగ నొసంగఁదలఁచియున్నవాఁడను. కాఁబట్టి అట్టివారు మీలోనెవరైన నుండినయెడల వారా గోసహస్రమును యథేష్టముగ గ్రహించి తోడ్కొనిచనవనగు"నని వారియెదుటఁ బ్రకటించెను. ఆపలుకుల నాలించి బ్రాహ్మణులందఱొకరిమొగ మొకరు చూచుకొనువారలైనవారే కాని, యాగోసహస్రమును గ్రహింప సాహసించినవారెవరును లేరైరి. గోగ్రహణమున కుద్యుక్తుఁడగు బ్రాహ్మణుఁడొక్కఁడైన నాబ్రాహ్మణబృందమునందుఁ బొడఁగానమికిఁ జింతిల్లుచు, యాజ్ఞవల్క్యుఁడు, తనశిష్యులలో నొక్కనిఁ జీరి, యాతనితో గోసహస్రమును దనయాశ్రమమునకుఁ దోలుకొనిజనుమని యాదేశించెను ఇట్లు యాజ్ఞవల్క్యుఁడు నిస్సందేహముగ శిష్యునకొసంగిన యాదేశమాలించి యుపస్థితబ్రాహ్మణులు, తపోధనులు, పలువురాతనియెడ నసంతుష్టులై యాతనితో శాస్త్రార్థమొనరించి, యాతనివలన పరాజయముఁబడసి, యాతని బ్రహ్మవిదులలో సర్వశ్రేష్ఠునిగ స్వీకరించి సమ్మానితునిఁగావించిరి అనంతరమాతఁడు ఆశ్రమమునకరుదెంచి మైత్రేయీకాత్యాయనులను తనయిరువురుపత్నులను చేరఁబిలిచి, "నేనిదె సన్న్యాసాశ్రమమును గ్రహియింపనున్నాఁడను. నాయాజ్ఞను గ్రహియించి, నాసంపత్తును మీరుభయులును సరిసమానముగఁ జేకొని సుఖంబునమనుఁడు. నాకు సంతోషపూర్వకముగ సమ్మతినొసంగుఁడు" అని వారితో చెప్పుచు వారియనుమతి నభిలషించెను. అంతట, మైత్రేయి "మీరాయనుగ్రహించు సంపత్తి నాకమరత్వ మొందఁగూర్చునదియగునా! కాదేని, దీనిని నేనాశింపను. చేకొనవొల్లను, అను

రత్నమొడఁగూర్పఁ గలసంపత్తి యిద్దియో అద్దానినే నాకొసంగి నన్నుఁ గృతార్థురాలనుగాఁ జేయుఁడు" అని సవినయముగ భర్తఁ బ్రార్థించెను. పత్నిప్రార్థన మాలించి యాజ్ఞవల్క్యుఁడు ప్రసన్న హృదయుఁడై భవరోగమున కేకమాత్రౌషధమగు బ్రహ్మావిద్య నామె కుపదేశపూర్వకముగ నొసంగెను. పత్యుపదిష్టమార్గాను సరణముగ మైత్రేయి యష్టాంగయోగమును సాధన మొనర్చి బ్రహ్మజ్ఞానమును బడసినదయ్యెను. యాజ్ఞవల్క్యుఁడు మైత్రేయి కొసంగిన యుపదేశము గ్రంథరూపమును దాల్చి 'యాజ్ఞ వల్క్యయోగ'మను పేరఁ బ్రఖ్యాతమగుచున్నయది. ఆగ్రంథ మునుబోలినగ్రంథము 'పాతంజలియోగదర్శనము' తక్క మఱి యొక్కటి గానరాదు.

యాజ్ఞవల్క్యుఁ డొకప్పుడు జనకమహారాజుకడ కరు దెంచెను. అన్యోన్యకుశలసంవాదానంతరము సగుణబ్రహ్మముఁ గూర్చిన ప్రస్తావన ముపస్థితమయ్యెను. జనకుఁడు సగుణబ్రహ్మ మును గూర్చినవిషయమునే యెఱింగియున్నవాఁడు. అద్దానినే సంపూర్ణమగుబ్రహ్మజ్ఞానమని తలంచియున్నవాఁడు. అట్టిజన కునిభ్రమను యాజ్ఞవల్క్యుఁడు నివారణమొనరించి యాతనికి నిర్గుణబ్రహ్మోపాసనావిధాన ముపదేశించి, యాతని జీవన్ముక్తుని గావించెను. యాజ్ఞవల్క్యునియుపదేశముచొప్పున జనకుఁడు నిర్గుణబ్రహ్మము నుపాసించి అచ్యుతపదమును బడసినవాఁ డయ్యెను.

యాజ్ఞవల్క్యుఁడు వైశంపాయనమహర్షి శిష్యుఁడు. ఆతనికడ యజుర్వేదమును అభ్యసించినవాఁడు. ఒకప్పుడు మహర్షులందఱు నొకచోఁగూడి యొకానొకపర్వతశిఖరమందు

ఋషిసభ జరుపుటకు నిశ్చయించి, ఆసభకు మహర్షులందఱును రావలయును; రానివారలు వారముదినములలో బ్రహ్మహత్యాపాతకమునకు లోనగువారలగుదురు! అని ప్రకటించిరి. ఆప్రకటనముమేరకు మహర్షులందఱు శాపభయం దుపస్థితులైరి. కాని వైశంపాయనుఁడు కారణాంతరమున రాఁజాలక బ్రహ్మహత్యాపాతకమునకు లోనైనవాఁడయ్యెను. అంత నాతఁడు కడుదుఃఖితుఁడై, తనశిష్యులను రావించి, వారలకు, తపంబొనర్చి తనకలవడిన బ్రహ్మహత్యాపాతకమును బాఱఁద్రోలుఁడని యాజ్ఞయొసంగెను. గుర్వాజ్ఞను శిరసావహించి శిష్యులందఱు తపంబు సలుపుట కుపక్రమించిరి. ఆసమయమున యాజ్ఞవల్క్యుఁ డందు లేఁడు. ఎందేని చనియుండెను. ఆతఁ డాశ్రమమున కరుదెంచి అయ్యుదంత మాద్యంతమును గ్రహియించి, గురువు చెంతకరిగి, "మీరలీశిష్యులవలన కార్యసాఫల్యమును గనఁజాలరు. వీరలు మీకలవడిన బ్రహ్మహత్యాపాతకమును బాఱఁద్రోలనేరరు. నాకాజ్ఞ నొసంగుఁడు. నేను కఠోరతపంబొనర్చి మిమ్ములను పాపవిముక్తులఁ గావించెదను." అని సగర్వముగఁ బలికెను. యాజ్ఞవల్క్యుని గర్వపూరితములగు నాపలుకుల నాలించి వైశంపాయనుఁడు రుష్టుఁడై తనకడ గ్రహించినవిద్యను తనకు మరల సమర్పించి తనయాశ్రమమును వీడి యెందేని పొమ్మని యాతని కాదేశించెను. అంత మహాభిమానియగు యాజ్ఞవల్క్యుఁడు, తాను వైశంపాయనుకడనుండి గ్రహించినవిద్యను వమనమొనర్చి తన్మూలకముగ నాతని కర్పించి యాతనియాశ్రమమును వీడి వెడలిపోయెను అట్లు యాజ్ఞవల్క్యుఁడు, వమనపూర్వకముగ వైశంపాయనునకు మరల నర్పించినవిద్యను, తక్కుఁగల మహర్షులు తిత్తిరిపక్షులై గ్రహియించిరి. ఆకారణమున నది యొద

లు వేదభాగము, 'కృష్ణయజుర్వేదము, తైత్తిరీయశాఖ'యని ద్వివిధమయ్యెను. అనంతర మాతఁడు వేదవిద్యఁబడయుటకై సూర్యునినారాధించెను. సూర్యుఁడు ప్రసన్నుఁడై యాతనికివేద విద్యనొసంగెను. సూర్యుఁడు యాజ్ఞవల్క్యునకొసంగిన వేద విద్య 'శుక్లయజుర్వేద'మనునామమునఁ బ్రసిద్ధము.

యాజ్ఞవల్క్యునకు కణ్వమాధ్యందినులను నిరువురు పుత్త్రులుదయించిరి. వారును దండ్రింబోలి తపోధనసంపన్నులు. [illegible]పండితులు.

## 7. కర్దమమహర్షి.

కర్దమమహర్షి బ్రహ్మమానసపుత్త్రుఁడు. ప్రజాపతులలో నివాఁడు. ఆతఁడు బ్రహ్మచే ప్రజాసృష్టియొనర్చుటకు, సంతానోత్పాదనమొనర్చి సృష్టిని వృద్ధియొనర్చుటకు, అనుజ్ఞాతుఁడై స్రోతస్స్వతి సరస్వతీతీరమున కరిగి యందు సమాధిస్థుఁడై చిరకాలము శ్రీహరి నారాధించెను. ఆతనితపస్సునకును, ఆతని యారాధనమునకును శ్రీమన్నారాయణుఁడు ప్రసన్నుఁడై యాతనికి దర్శనమొసంగెను. ప్రజాపతికర్దముఁడు భగవద్దర్శనమును బడసి భక్తిపరతంత్రుఁడై, గద్గదకంఠుఁడై, యథోచితరీతిని స్తుతియొనర్చి యాతని నలరించెను. కర్దమస్తుతులకు శ్రీహరి హృష్టచిత్తుఁడై, గంభీరనిస్వనమున, "నో ద్విజోత్తమా! నీతపస్సునకు సంతసించితిని. నీవాంఛితము సఫలముగాఁగలదు. నీవు అనురూపమగుభార్యను, అనుకూలమగుసంతానమును అభిలషించి నన్ను భక్తియుక్తముగ నారాధించితివి. నీయభిలాషము సఫ

ఘ్రముగ పమకూరఁగలదు. అచిరకాలములో స్వాయంభువు మనువు తనభార్యయగుశతరూపను, కన్యయగు దేవహూతిని వెంటనిడుకొని నీయాశ్రమమున కరుదెంచును. మనుకన్య దేవహూతిరూపవతి. శీలవతి. యౌవనావస్థయందు పదార్పణానిఁడిన యది ఆమె నీకు భార్యకాఁగలదు. మనువామెను నీకు సమర్పించి నీవాంఛితమును బూర్తియొనరించును. దేవహూతిగర్భము నుండి పలువురు కన్యలఁ బడయఁగలవు. అనంతరమామె గర్భ జనితుఁడనై సాంఖ్యవిద్యను బ్రకాశింపఁజేసెదను. నీవు గృహస్థాశ్రమమునందు బ్రసిద్ధుఁడవై, భూతదయాపరతంత్రుఁడవై ప్రవర్తిలుచుండుము." అని పలుకుచు నంతర్హితుఁడయ్యెను.

శ్రీహరి యింతర్హితుఁడైనయనంతరము ఋషివరుఁడు కర్దముఁడు సరస్వతీవ్యాపృతమగు బిందుసరోవరతీరమునకరు దెంచి యందు నివసింపఁజొచ్చెను. కొంతదినములు సాఁగఁగా మనువు కర్దమప్రజాపతియాశ్రమమున కరుదెంచి యాతనికి విధ్యుక్తవిధి నభివాదన మొనరించెను. కర్దముఁడును మనువున కాగతస్వాగతమొసంగి, యాతని నర్ఘ్యపాద్యాద్యుపచార ములఁ బూజించి తుష్టునిఁగావించి, యనంతర మాగమనకారణ మెఱిఁగింపుఁడని సవినయముగఁ బ్రార్థించెను. కర్దమునినోటనుండి వెలువడినవచనామృతమును గర్ణపుటములఁగ్రోలి మనువు సంతోషతరంగితాంతరంగుఁడై, సవినయముగ, "ఓమహర్షిసత్తమా! ఈ దేవహూతి నాకన్య పరిణయయోగ్యయయ్యె. ఈమెకు వివాహముచేయకుండనే పనిచేయుటకును వలనుపడకుండెను. ఈమెను సుపాత్రునకర్పింప మదినెంచి తన్వేషణమున పరిభ్ర మించుచుండ, దేవర్షి నారదుఁడు, తాము వివాహోత్సుకులరై యున్నవారలని యెఱిఁగించెను. కావున్నిసర్వలక్షణసంపన్న యగు,

సుగుణగణసమన్వితయు నగునాయీకన్యను పరిగ్రహించి పరిణయమై నన్నుఁ గృతార్థునిగఁ జేయుఁడని వినీతభావమునఁ బ్రార్థించుచున్నాఁడ”నని బదులొసంగెను. అంత, తాను మున్ను భగవంతునివలన వినినవాక్యము తలంపునకుఁ బాఱ, కర్దముఁడు మనుప్రార్థనమును స్వీకరించెను. కర్దముఁడు దేవహూతిపాణిఁ గ్రహియించుట కంగీకృతుఁడయ్యెనని మనువు సంతసిలుచు, యనతికాలమున దేవహూతిని కర్దమప్రజాపతికి వేదోక్తరీతిని సంప్రదానమొనరించెను. ఇట్లు దేవహూతిని కర్దమునకు వైవాహికవిధిని సమర్పించి మనుశతరూపలు ఆనందాంబుధినోలలాడుచు, అల్లునకు కూఁతునకు నరణంబులొసంగి నిజరాజధానికి మరలినవారలైరి.

తల్లిదండ్రులు వీడిచనినయనంతరము, పతివ్రతయగు దేవహూతి, మనోవాక్కర్మములఁ బతినే దైవముగఁ బరిగణించుచు, పతిసేవయే సలుపుచుండెడిది. ఆపెయొనర్చు సేవకు కర్దమఋషి యతిశయసంతుష్టుం డగుచుండెడివాఁడు ఇట్లుకొంత కాలమరుగుఁడు, అసాధారణతపస్వియగు కర్దమప్రజాపతి, తనతపోమహిమవలన నొకదివ్యవిమానమును నిర్మాణమొనరించి సపత్నీకముగ నం దారూఢుండై విహారింపఁజొచ్చెను. దేవహూతి, వసు, అనసూయ, శ్రద్ధ, హవిర్భు, గతి, క్రియ, ఖ్యాతి, అరుంధతి, శాంతినామ్నులను తొమ్మండుగురుకూఁతులను ప్రసవించెను. కర్దముఁడీకన్యలలో వసుని మరీచికిని, అనసూయను అత్రికిని, శ్రద్ధను అంగిరునకును, హవిర్భుని పులస్త్యునకును, గతిని పులహునకును, క్రియను క్రతునకును, ఖ్యాతిని భృగునకును, అరుంధతిని వశిష్ఠునకును, శాంతిని అథర్వునకును వైవాహికవిధిని సంప్రదానమొనరించెను.

కొలఁదికాలమరిగినపిమ్మట పూర్వప్రతిజ్ఞానుసరణముగ కమలామనోహరుఁడు శ్రీమన్నారాయణుఁడు దేవహూతి గర్భమున కపిలనామమున జన్మించెను కపిలదేవుఁడు జన్మగ్రహణమొనర్చిన యనంతరము కర్దమప్రజాపతి, భార్యయగు దేవహూతి పరామర్శానుసరణముగ వానప్రస్థుఁడై కఠోరతపము సలుపఁజొచ్చెను. ఆతఁడు తనపాపతాపములనన్నిటిని యోగాగ్నిజ్వాలల శాంతులుగావించి విష్ణుపదమును జొఱఁగొనియెను.

కపిలుఁడు కాలానుగుణముగ వేదశాస్త్రపారగుఁడయ్యెను. తల్లియగు దేవహూతికి తత్త్వోపదేశమొసంగెను. ఆయుపదేశమువలన నామెను మాయామోహము వినష్టమయ్యెను. బ్రహ్మజ్ఞానములవడియెను. అనతికాలముననే యామె యచ్యుత పదమునుబడసి కృతార్థురాలయ్యెను.

అనంతరము కపిలదేవుఁడు, త్రితాపదగ్ధుల, మనుజుల కళ్యాణార్థము, సాంఖ్యదర్శనమును రచియించి మోక్షమార్గమును సుగమము గావించెను. ఆతఁడు సాంఖ్యదర్శనమున నీశ్వరసత్తను అంగీకరించినవాఁడు కాఁడు. అందువలన కొంద ఱాతనిని నిరీశ్వరవాదియనియందురు. కపిలుఁడు సాంఖ్య దర్శనమునందు, "జగత్తు జడము. ప్రకృత్యుత్పన్నము. ప్రకృతి అనాది ప్రకృతివలెనె పురుషుఁడు (జీవుఁడు)కూడ అనాదియై యున్నవాఁడు. మనుజులు కర్మఫలానుసరణముగ నొకశరీరమునువీడి మఱియొకశరీరమును ధరియించువార లగుచుందురు" అని నిరూపించియున్నవాఁడు. ఆవిచారణమిట యప్రస్తుతము.

కపిలుఁడు సాంఖ్యదర్శనరచనానంతరమున మాతాజ్ఞఁబడసి పాతాళమునకరిగి యందు తపంబుసలుప నారంభించెను. పవిత్ర హృదయయగు దేవహూతియు కపిలుఁడుపదేశించిన తత్త్వజ్ఞాన మహిమవలన బ్రహ్మపదప్రాప్తిఁగనియెను. కపిలుఁడు తపోనిరతుఁడై యుండిన సమయమందు అయోధ్యాధిపతిసగరుఁడుఅశ్వమేధయాగమును సలుపుట కుపక్రమించి, సవనాశ్వమును భూపరిక్రమణమునకు విడిచిపుచ్చి, తదశ్వరక్షణమునందు తన యాఱువేలపుత్త్రులను నియోగించి యద్దానివెంట నని పెను. అంత నింద్రుఁడు మాయావేషధారియై యరుదెంచి, యాసవనాశ్వమును హరియించి యద్దానిఁ గొనిపోయి, పాతాళలోకములో తపోనిమగ్నుఁడగిలియున్న కపలమునియాశ్రమమునందు విడిచిపుచ్చెను. గుఱ్ఱమువెంట బయలువెడలిన సగరపుత్త్రు లాగుఱ్ఱమునుగానక, భూలోకమందెల్లయెడల వెదకి వెదకి యద్దానిజాడ నరయనేరక పరితపించుచు పాతాళముఁ జొచ్చి యందు కపిలాశ్రమములోఁ దిరుగాడుచున్న యాసవనాశ్వమునుగని, యద్దానినపహరించి తెచ్చినవాఁడు కపిలుఁడు గానెంచి యాతని దూషింపఁదొడంగిరి. అంతకపిలుఁడు క్రుద్ధుఁడై యాఱువేలసగరపుత్త్రులను శాపమొసంగి భస్మీభూతులుగఁ గావించెను. అనంతరము, సగరవంశీయుఁడు భగీరథుఁడు ఘోరతపమొనర్చి గంగావాహినిఁ గొనితెచ్చి యాభస్మరాశులపై ప్రవహింపఁజేసి తనపితరులకు సద్గతినొసంగెను.

# 8. జరత్కార మహర్షి.

జరత్కారుఁడు ఋషికులశేఖరుఁడు. బ్రహ్మదేవునకు సాటియగువాఁడు. ఊర్ధ్వరేతస్కుఁడు. తపఃపరాయణుఁడు. వేదాధ్యయనశీలుఁడు. పరిశుద్ధచిత్తుఁడు. సర్వసమర్థుఁడు. తీక్ష్ణవ్రతుఁడు. ధర్మజ్ఞుఁడు. బ్రహ్మచర్యవ్రతమూనినవాఁడు. ఉగ్రతపమును సలుపుటయందే యాసక్తుఁడైయుండును. ఆహారమునుమాని వాయువునే భక్షించుచు శరీరమును క్షయింపఁజేసి శల్యావశిష్టమొనర్చిన కతమున జరత్కారుఁడను నామమును బడసినవాఁడు. ఆతఁడొకప్పుడు ప్రొద్దుగ్రుంకినచోటే విడిసినట్టుగా భూమియంతయుఁ బ్రదక్షిణమొనరించెను ఆ తపోనిధి సమస్తతీర్థములయందు తానమాడుచు,వాయుభక్షుఁడై శరీరమును శుష్కింపఁజేయుచుఁ దిరుగుచుండెను.ఆతఁడట్లు దిరుగాడుచు, నొకానొకప్పుడొక పెద్దపల్లమునందుఁ దలక్రిందుగా నవురుగంటికొన నంటికొని వ్రేలాడుచున్న తన పితరులను జూచెను. ఆవ్రేలాడువారు తనపితరులని యెఱుంగక, జరత్కారుఁడు వారిచెంతకుంబోయి"ఈ పెనుపల్లమునందే యెప్పుడును దాగి నివసించుచుండిన మూషికమొండు నాయవురుగంటివేళ్ల నన్నింటిని కొఱికివేయఁగా, దుర్బలమైనయీయవురుగంటికొనను బట్టికొనివ్రేలుచున్నారే! మీరలెవరు? ఈయవురుగంటకు నొక్కవేరే మిగిలియున్నది. దానినిఁగూడ నీయెలుక కొఱికివేయుచున్నది. ఈవేరుకూడ పట్టుసడలియున్నందున నిదియును అచిరకాలములోనే తెగిపోవును. అపుడు మీరు తలక్రిందుగా నీపల్లమునందు నిశ్చయముగాఁ బడువారలగుదురు.

ఇట్లు తలక్రిందుగా వ్రేలుచు నుత్కట సంకట మనుభవించు చున్న మిమ్ములఁజూడ నాకు దుఃఖము మిక్కిలి గలుగుచున్న యది. మీకు నేను జేయఁదగినయుపకార మేదైననుండిన యెడల నెఱిఁగింపుఁడు. నాతపస్సునంతను వెచ్చించియైన మీకు హితము సమకూర్చెదను. ఈవిపత్తునుండి కడతేరుట కిష్టముగల వార లగుదురేని జాగుసేయక చెప్పుఁ"డని యనియెను.

జరత్కారునిపలుకులు విని, యాతనిపితృదేవతలు "నీవు బ్రహ్మచారివై యున్నావు. మాకు హిత మొనగూర్చుటయెట్లు? మాయీసంకటము తపస్సుచేతఁ దొలఁగించుట కశక్యము. తపోధనా! తపోధనము మాకును గొంతఁగలదు. కలిగిన నేమి? సంతతి లేనివారలమగుటవలన పాపాత్ములఁ బోలె నరకకూపమునఁ గూలఁబడనున్నారము. సత్తమా! మాకు ప్రాప్తమయిన యీ సంకటము చేత మాబుద్ధి సన్నగిల్లినది. నిన్ను గుఱుతిడ నేరకున్నారము. నీవు మహానుభావుఁడవుగా నున్నాఁడవు. వృద్ధుఁడవుగా నున్నాఁడవు. మమ్ముఁ జూచి దుఃఖించుచున్నాఁడవు. కాఁబట్టి మావృత్తాంతమును వినిచెదము. వినుము. నాయనా! మేము దృఢవ్రతముగల యాయావరు లనఁబడుఋషులము. సంతతి కొఱవడుట కారణముగ పుణ్యలోకమునుండి జాఱి భూమికిఁ దలక్రిందుగాఁ బోవుచున్నారము మాకు సంతతి లేనందున మా తపస్సంతయు వ్యర్థమైపోయినది. భాగ్యహీనులమగు మాకు నభాగ్యుఁడొకఁడు సంతతికి మిగిలియున్నాఁడు వాఁడు నుండియు లేనివాఁడుపోలెఁ దపమునొక్కటినే గైకొనియున్నాఁడు వాఁడు జరత్కారుఁడని పేరొందినవాఁడు. వేదవేదాంగవిదుఁడు. విజితేంద్రియుఁడు. మహాత్ముఁడు. నియమవ్రతుఁడు. మహాతపస్వి. వాఁడు తపస్సునం దేయాసక్తుఁడై మమ్ముల నీవిపత్తునకుఁ దెచ్చిన

వాఁడు. మహాభాగా! మాకు వాఁడు నాథుఁడై యుండియున్నప్పటికిని, మేము పుణ్యహీనులవలె యనాథులమై యీపల్లమున వ్రేలుచున్నారము. సంతతిలేని మనుజు లెంతటిపుణ్యవంతులైన నేమి, వారలకు స్వర్గమందు వసతిదొరకదు. మాకు జరత్కారుఁడొక్కరుఁడు నాథుఁడై యున్నవాఁడు. కాఁబట్టి, దయాళూ! నీవు వానిని జూచినయెడల 'నీపితరులు దీనులై పుణ్యహీనులై పెనుపల్లమునందుఁ దలక్రిందుగా వ్రేలుచున్నారు. పెండ్లిచేసికొనుము సంతతిని బుట్టింపుము. అట్లుచేయుదువేని వారలు సద్గతికులగుదురు. లేనిచో దుర్గతికు లగుదురు.' అని వానితోఁ జెప్పుము. బ్రాహ్మణోత్తమా! మాకులమునకు ఆజరత్కారువు అను నొంటిదంతువే మిగిలియున్నయది మాకుఁ బట్టుగా నీవు చూచెడియీయవుసుగంటయే మాకులముగంటు ఇది మాకులమును బెంపొందించునదైయున్నయది. ఈగంటునకుఁ గల వేళ్లనుజూచుచున్నావే ఇవియే మాకులంపుదంతువులు. ఇవియే కాలునిచే భక్షింపఁబడినవి. దీనివేరొకటి సగము భక్షింపఁబడి యున్నదానిని, మేము బట్టుకొని వ్రేలుచున్నదానిని నీవు చూచుచున్నావే, ఇదియే తపమునేవ్రతముగాఁ జేఁబట్టియున్న జరత్కారుఁడు. నీవుచూచుచున్నయెలుకయే దుర్జయుఁడగు కాలుఁడు. ఆకాలుఁడు, తపమునందే స్థిరచిత్తుఁడై మతిమాలియున్న జరత్కారుని బీడించుచు క్రమక్రమముగా క్షీణింపఁ జేయుచున్నాఁడు. ఇట్లు మూలముదెగి పుణ్యలోకమునుండి జాఱి, మతిమాలియున్నమమ్ము వాఁడు తానుజేసినయాతపస్సు చేత నీవిపత్తునుండి దాటింపఁజాలఁడు. వాఁడును కాలమాసన్న మగుఁడు, మావలెనే కాలపీడితుఁడై యిందుఁ బడి నరకమును బొందఁగలవాఁడగును. నాయనా! తపస్సుగాని, యజ్ఞముగాని,

తపోవ్రతపవిత్రకర్మములు గాని సంతతికి సాటిగాఁజాలునవిగావని సజ్జనులమతము. మహాశయా! నీవాజరత్కారునిఁ జూచి చెప్పుము. మఱువకుము. నీవిక్కడఁ జూచినదంతయు సవిస్తర ముగ వానికిఁ జెప్పుము. వాఁడు మాకు నాథుఁడుగా నున్నాఁడు. కాఁబట్టి, యెట్లు చెప్పిన వాఁడు పెండ్లి చేసికొని సంతతినిబుట్టిం చునో, యట్లే మమ్ము నీబంధులముగానెంచి మామేలుకొఱకు వానికిఁ జెప్పవలయును. సత్తమా! బంధువుఁబోలె మమ్ముఁజూచి యిట్లు దుఃఖించుచున్నావే; నీవెవ్వఁడవు? నీవు మాకేమి కావల యును! వివరింపుము? వినఁగోరుచున్నా"మని పలికిరి.

జరత్కారుఁడు పితరులమాటలు విని, మిక్కిలి దుఃఖి తుఁడై, డగ్గుత్తికఁగొని వారిఁ జూచి "మీరు నాపూర్వజులైన పితలును, పితామహులును నై యున్నవారు ఇపుడు, నేను మీహితముఁగోరి యేమి చేయవలయునో చెప్పుఁడు నేనే మీ వంశధరుఁడను అయోగ్యుఁడను. జరత్కారుఁడను. మతి మాలి పాపకర్ముఁడనై యున్న నాకు మీరుచితదండమును విధిం పుఁడు "అని చెప్పెను. అందులకుఁ జరత్కారునిపితరులు "వత్సా! నీవు యాదృచ్ఛికముగ నిచ్చటకు వచ్చుట మాభాగ్యమేను. నీ వెందులకు వివాహము చేసికొనమానితివో చెప్పుము నీవు వివాహము చేసికొని సంతానమునుబడయుటయందు మనస్సుం పుము. నీవు పుత్రవంతుఁడవగుదువేని మేము ఈదురవస్థనుబాసి నిశ్చింతతో స్వర్గసుఖమనుభవింపఁ గలవారమగుదు"మని యనిరి. అందులకుఁ జరత్కారుఁవు, "పితరులారా! నేను ఊర్ధ్వరేతస్కుఁ డనై బరలోకమును బొందవలయునని నిశ్చయించుకొనియు న్నాఁడను. అందువలన వివాహము చేసికొనుటలేదని నామన మను గుదురుపఱుచుకొని యుంటిని. పితరులారా! మీారు

పడుచుచున్న యీవెతఁజూచియే బ్రహ్మచర్యమునుండి నామన స్సుఁద్రిప్పికొంటిని. మీరుకోరినకార్యమును జేయుచున్నాను. నేను, నా సుఖముకొఱకుఁగాని, జీవనముకొఱకుఁగాని, భార్యనుగాని, ధనమునుగాని సంగ్రహించుటకు యత్నమొనరింపను. కాని, మీకు హితమొనర్చుటకుఁగాను, మీకు పారలౌకికసుఖ మొడఁగూర్చుటకుఁగాను వివాహ మవశ్యముచేసికొనెదను. అయినను, నేను జేపట్టుకన్య నాపేరుగలదిగానుండవలయును. దానిబంధువులు తామై నాకాకన్యను, స్వేచ్ఛాపూర్వకముగ, భిక్షాస్వరూపముగ, నిచ్చుటకు సిద్ధముగాఁ బెట్టికొనియుండవలయును. అట్టికన్య నాకు నెప్పుడు లభించినను దానిని నేను వివాహము చేసికొనెదను; కాని, నేను దానిని బెట్టికొని కాపాడను. ఇట్టివివాహము దొరకొన్నయెడ జేసికొందును లేనియెడఁ జేసికొనను. ఇది నిజము." అని వారితోఁ జెప్పి, వారియనుమతిఁబడసి, అట్టికన్యను వెదకుటకు బయలువెడలెను.

జరత్కారుఁడు, వివాహమునకై భార్యఁగోరి భూమి యంతయుఁ దిరిగెను; కాని, యట్టిభార్య యలవడినది గాదు. అంత నాతఁడు నిర్వేదమును బొందుచు, నొక నిర్జనవనములోని కేగి, పత్నీప్రాప్తికొఱకు భగవంతునిఁ బ్రార్థించుచు, "నేను కన్యాభిక్షను వేడుచున్నాను. ఇందుగలస్థావరములు, జంగమములు, దృశ్యాదృశ్యులగు దేవతలు నేనుచెప్పునది వినుదురుగాక! దుఃఖార్తులై యున్న పితరులు, తపోనిరతుఁడనై యున్న నన్ను, సంతతిఁ గలిగించుటకై వివాహము చేసికొమని యాజ్ఞాపించియున్నారు. వివాహమునకై కన్యాభిక్షఁగోరి భూమియంతయుఁ దిరిగితిని. నేను దరిద్రుఁడను. కష్టపడుటయే స్వభావముగాఁ

గలవాఁడను. అంతటను దిరిగిటిరిగి యలసియున్న వాఁడను. నాపలుకుల నాలించినవారిలో నేరికైన కన్యయుండియున్న యెడ, వారాకన్యను నాకిత్తురుగాక, ఆకన్య నా పేరుగలదై నాకు భిక్షవలెనొసంగుటకు నుంచుకొన ఒడినదై యుండవల యును. నేను దానిని కాపాడనవసరములేనిదిగా నుండవల యును. అట్టికన్యకను నాకొసంగుఁడు" అని ముమ్మాఱు బిగ్గరగా నఱచెను.

సర్పరాజువాసుకి, మాతృశాపమునుండి, సర్పకులమును సంరక్షించుటకునై, తనసోదరిని, జరత్కారయనుపేరుదానిని, జరత్కారునకిచ్చి వివాహముచేయుటకు కాచికొనియుండెను. ఆతఁడు జరత్కారునిపలుకులనాలించి, సాలంకృతయగు తన సోదరిని వెంటనిడుకొని యడవియందున్న యాజరత్కారు కడకుఁ బోయి యాతనికాకన్యను భిక్షనుఁబోలె సమర్పించెను. అంత నామహర్షి వాసుకివలన నాకన్య పేరు జరత్కారువని, తన స్సుతోఁ గూడినదని దెలిసికొని, "నేను దీనినిబోషింపను. నాకు నిష్టముకానిదానిని, యిదిచేయఁగూడదు. చేసినయెడ నేను దీనిని దిగవిడుతును. ఇదియే నేఁజేసియున్న సమయము." అని చెప్పెను. అప్పుడు వాసుకి, జరత్కారుమహర్షిఁజూచి "నేను నా సహోదరినిఁ బోషించుకొనియెదను" అని ప్రతిజ్ఞ చేసెను. అంతట జరత్కారుఁడు, నాగరాజుగృహంబునకుఁ బోయి విధ్యుక్తముగా నాకన్యను పాణిగ్రహణముచేసికొనెను. అనం తరము తనయిల్లాలినిఁ జూచి "నీవు నాకిష్టముకానిదానిని యెన్నఁ డుగాని చేయరాదు. చెప్పరాదు. అప్రియమును జేసినపుడు నిన్నును నీయింటినిఁగూడ దిగవిడుతును. నేను జెప్పినయీమా- టను గ్రహించుకొనుము." అని సమయముచేసెను. పతివ్రత

యగుజరత్కారువు. ఆసమయమునువిని మిగులభయమునొంది యెంతయుదుఃఖమున నతనిఁజూచి 'అట్లనే కానిండు' అనిపలికెను. జరత్కారుమహర్షి ధర్మపరాయణయగు జరత్కారువుఁను భార్యగాఁ బడసి అత్యంతప్రసన్నుఁడయ్యెను. జరత్కారువు ప్రాణపణముగఁ బతిసేవఁ జేయుచు, కొంతకాలమునకు గర్భవతియయ్యెను. ఆగర్భము శుక్లపక్షచంద్రునిఁ బోలె వర్ధిల్లసాగెను. ఇట్లుండ నొకనాఁడు తపశ్శాలియగు జరత్కారుమహర్షి క్లాంతివివశుఁడై, తనభార్యయొడియందుఁ దలయిడి నిదురఁబోయెను. అట్లు నిద్రించునపుడు, సూర్యుఁ డస్తంగతుఁడయ్యెను. కాని, యాతఁడు మేల్కొనుజాడ పొడసూపకుండెను. అప్పుఁడావాసుకిచెల్లెలు ధర్మముచెడునేయని భయఁపడి 'నేను భర్తను లేపుట ధర్మమగునో కాదో; లేపితినేని యితని కపరాధము చేసినదాన నగుదును. దాన నితనికి నిశ్చయముగా కోపము గలుగును. లేపకపోవుదునేని, సంధ్యాకాలము గడచిపోవును; దాన నీతనిసంధ్యావందనాది సాయంకాలకృత్యములకు విఘ్నమాపాదించినదాన నగుదును. అందువలన ధర్మమునకు లోపము వాటిల్లును. ఈ రెంటిలోనితనికోపముకంటె ధర్మలోపమెక్కుఁడు' అని నిశ్చయించి, యాపతివ్రత నిద్రితపతిని మేలుకొలిపి "మహాభాగా! లెమ్ము. సూర్యుఁ డస్తమించుచున్నాఁడు. జలములు సిద్ధముగానున్నవి ఆచమించి నియమానుసరణముగ సంధ్యనుపాసింపుఁడు. ఇదెయగ్నిహోత్రము. ఈముహూర్తము ధర్మసాధనమగుట కారణముగ రమణీయముగను, భూతాదిప్రభావమువలన భయంకరముగను నొప్పుచున్నయది. పడమటిదెస సంజవత్తిలాచున్నది." అని చెప్పెను. ఇట్లు చెప్పఁగా, జరత్కారుఁడు రుష్టుఁడై, భార్యఁజూచి, "నాగకన్యకా! నేను నిదురించుచుండఁగా సూర్యుఁ

దస్తగతుఁడగుటకు శక్తుఁడుగాఁడని నానిశ్చయము. నీవు, నేను క్లాంతివివశుఁడనై నిద్రించుచుండ నన్నులేపి నాకిట్లు అవమానమొనరించితివి. అవమానము పొందినపిమ్మట నిచట నుండుట నాకు రుచియింపదు. ఇక నీదాపున నుండనొల్లను. నేనికె వచ్చినదారినే పోయెదను. నేను వెడలిపోయినపిదప నీవు శోకము నొందుచుండరాదు." అని యనియెను. అంత వాసుకి సోదరి, శోకదుఃఖములకు లోనై కన్నీరుమున్నీరుగా నేడ్చుచు, డగ్గుత్తికతో, "ప్రాణనాథా! నేను మిమ్ము నవమానింపనెంచి మేలు కొలిపినదానను గాను. మీకు ధర్మలోపము కలుగకుండవలయు నని నేనిట్లు చేసితిని. నీవు ధర్మములన్నియుఁ దెలిసినవాఁడవు. ధర్మమును దప్పనిదాననై యెప్పుడును నీకు హితమొనర్చుట యందే యాసక్తిగలిగియున్న నన్ను ఏతప్పునెఱుఁగనినన్ను ధర్మ మును ఎంతమాత్రము తప్పకుండు నీవు దిగవిడుచుట ధర్మము గాదు. నన్ను మన్నింపుము. ఇఁక నేనేతప్పిదమును జేయను." అని యాతపస్విని బహుతెఱఁగులఁ బ్రార్థించెను; కాని, కోపసమా విష్టుఁడై యున్న యాతపస్వి తనభార్యను, ఇట్లు విహ్వాలహృద యయై ప్రార్థించుచున్నదానిని దిగవిడిచి పోవఁగోరి, "నాపలుకు అబద్ధముగాదు. నేను పోయెదను. సుందరీ! అగ్నిహోత్రమునకు పాటిదై, ధర్మవిదులలో మేటియై, వేదవేదాంగపారగుఁడై, మహాతపస్వియై పరఁగుపుత్త్రుఁడు నీకుఁ బుట్టఁబోవుచున్నాఁడు. ఆతనివలన నీకును నీదాయాదులకును మేలుసమకూడు." నని చెప్పి, మరల నుగ్రతపము సేయ నిశ్చయించి యచ్చోటు బాసి పోయినవాఁడయ్యె. భర్త చనినయనంతరము వాసుకిచెల్లెలు జరత్కారు వొకపుత్త్రునిఁ గనియెను. ఆతఁడు గర్భమందుండి నపుడే యతనితండ్రి అస్తి(ఉన్నాఁడు)అనిచెప్పి యడవికి పోవుట

చేత, నాపుత్రునికి 'ఆస్తీకుఁ'డని యాతనితల్లి పేరిడియెను. మేనల్లుఁడు పుట్టెనని వినినంతనె వాసుకి యానందభరితుఁడయ్యెను ఆపుత్రుఁడు వాసుకిగృహమునందె పెరిగి యథాసమయమున నుపనయనసంస్కారమును బడసి భృగునందనుఁడైన చ్యవనునియొద్ద వేదవేదాంగముల నధ్యయనము చేసెను. ఆతఁడు చిన్ననాఁడే మంచిబుద్ధియు, శాంతియు, సుగుణసంపత్తియుఁ గలవాఁడై బ్రహ్మచర్యవ్రతమును జరపుచుండెను ఇట్లు జరత్కారుఁడు పెద్దయుఁగాలమునకు బరిణయమై, ఆస్తీకుఁడను పుత్రునిఁ గని యుత్తమమయినధర్మము నాచరించి, పితరుల నుద్ధరించి, తనపితరులతోఁకూడఁ దాను స్వర్గమునకుఁ బోయెను. ఆస్తీకుఁడు తపోయజ్ఞాది కర్మములు చేసి దేవతలను, బ్రహ్మచర్యవ్రతమును వేదాధ్యయనమును సలిపి ఋషులను, పుత్రసంతతిని బడసి పితరులను తృప్తిపఱచినవాఁడయ్యెను.

ఆకాలమున జనమేజయుఁడనురాజు సర్పయజ్ఞమును జేయఁదొడంగెను. యాజ్ఞికు లుచ్చరించుమంత్రముల ప్రభావమువలనఁ బ్రతిదినమును లక్షలకొలఁదిసర్పములు, యజ్ఞకుండమునఁబడి భస్మముగాఁజొచ్చెను ఇట్లు నాగములు యజ్ఞకుండమున నెడతెగకపడుచు భస్మమగుచుండుట కారణముగ తన కులమువారు కొలఁదిమందిమాత్రమే మిగిలియుండుటఁగని వాసుకి మిక్కిలియు వెతగుందుచు, వారినైన కాపాడి కులమును సంరక్షించుటకుఁగాను, తన మేనయల్లుని ఆస్తీకుని జనమేజయునియాగశాల కనిపెను.అట్లు మాతులనియుక్తుఁడై యాస్తీకుఁడు యజ్ఞశాలకరుదెంచి రాజును బలువిధముల బ్రస్తుతించి ప్రసన్నునిఁగావించెను. రాజును ఆస్తీకుని విధ్యుక్తముగఁ బూజించి సుఖాసీనుఁగావించి వరమును గోరుమని హెచ్చరించెను.

ఆ స్తీకుఁడు యజ్ఞశాల కరుదెంచునంతకు, సర్పములు లెక్కకెక్కుడుగ యాగాగ్నికాహుతులై భస్మీభూతము లయ్యెను; గాని, జనమేజయునిదండ్రిని, పరీక్షిత్తుని ప్రాణముల నపహరించిన తక్షకుఁడు సజీవుఁడై యుండెను. ఆతనినాహుతునిఁ గావింపకుండ నాతనిమనస్సు శాంతినొందకుండెను. అందువలన నాతఁడు ఋత్విక్కులఁజీరి, "మంత్రవిదులారా! నా తండ్రిఁజంపినపాపాత్ముఁడు తక్షకుఁడే నాకు విరోధి. ఆతఁడింకను సప్రాణుఁడై యున్నాఁడు. ఆతని సశీఘ్రముగ విగతప్రాణునిఁ జేయుటకు మీశక్తినంతయుఁ బ్రయోగింపుఁడు" అని పలికెను. అంపులకు ఋత్విజులు 'మహారాజా! ఆక్రూరుఁడు, తక్షకుఁడు భయకంపితుఁడై యింద్రునియొద్ద నున్నాఁడు. ఆతని నగ్నిహోత్రున కాహుతియొసంగుట యనునది సహజమైనపని కాదు." అని బదులొసంగిరి. అపిపిని, యాగదీక్షితుఁడు జనమేజయుఁడు "ఇంద్రునితోఁగూడఁ దక్షకుని నగ్నికాహుతి యిడుఁడు. తక్షకు నెంతమాత్రము విడువరాదు." అని హోతలను హెచ్చరించెను. హోతలును; కడునిష్ఠులై "ఇంద్రుఁడును దక్షకునితోఁగూడియే యగ్నియందుఁబడుగాత"మనిహోమముఁ జేసిరి. అంతఁ దక్షకునితోఁగూడ నింద్రుఁ డరుదెంచి, యాయజ్ఞమును జూచి మిక్కిలిగ భయకంపితుఁ డయ్యెను. అందువలన నాతఁడు తక్షకునిఁ బరిత్యజించి నిజగృహంబునకు మరలినవాఁడయ్యెను.

ఇంద్రుఁడు మరలిపోయినపిమ్మట తక్షకుఁడు, హోతల యమోఘమంత్రశక్తిచేత బద్ధుఁడై, స్వాధీనతఁదప్పి, వివశుఁడై, స్వర్లోకమునుండి యవతీర్ణుఁడై యజ్ఞకుండ సమీపమున కరుదెంచుచుండెను. అ ట్లరుదెంచుచుండెడి తక్షకునిఁ జూచి,

యాస్తీకుఁడు, మార్గమధ్యమం దాతని నిలువరించి, రాజు దిక్కు మొగమై, "రాజా! నీవు నాకు వరమీయ నిచ్చఁగొని యున్నవాఁడ వయితివేని, నీయీ యొనర్చుసర్పయాగ మింతటితో నిలుచుఁగాత! ఇందు సర్పములు మడియకుండుఁగాత! ఇదియే నేఁ గోరుకొనువరము. ఇందువలన నాతల్లి వంశమునకు మేలు సమకూరును. నీకు శుభముకలుగును." అని యనియెను. అంతట జనమేజయుఁడు బ్రాహ్మణానురోధమును ప్రతిఘటించుట ధర్మవిరుద్ధము, పాపమూలము, అని తలంచి, యందుల కియ్యకొన నేరక, 'వల్లె' యని పలుకుచు, సర్పయాగము నసంపూర్ణముగఁ బరిసమాప్తమొనరించి, యాస్తీకుని హర్షచిత్తునిఁ గావించెను.

ఆస్తీకుఁడు, జనమేజయుని సర్పయాగమున దహనోన్ముఖులగుచున్న తక్షకాదిసర్పముల నట్లు మరలించి, వారలకు ప్రాణరక్షణ మొసంగి, వారికులమును పెంపొందఁజేసి, రాజు మన్ననలంగొని నిజగృహంబునకు జనుదెంచి, తల్లికిని, మామకును, జరిగినయుదంత మాద్యంతమెఱింగించెను. సర్పములా సమాచార మాలించి యానందాంబుధి నోలలాడుచు ఆస్తీకునకు "నీనామమును జపించువ్యక్తులకు సర్పభయము కలుగ నేర" దని వర మొసంగి, యాతని బహువిధములఁ బ్రస్తుతించెను. అనంతర మాస్తీకుఁడు, మేనమామగృహమున నివసించుచు, సర్పములచేతఁ బూజలుగొనుచు, యథాసమయమున బరిణీతుఁడై పుత్త్రోత్పాదన మొనర్చి, పితృఋణముక్తుఁడై, పిమ్మట తపోనిరతుఁడై విష్ణులోకమును బడసినవాఁడయ్యెను.



# 9. చ్యవనమహర్షి.

చ్యవనుఁడు భృగుమహర్షిపుత్త్రుఁడు. ఆతనిజన్మవృత్తాంతము కడువిచిత్రము. భృగుఁడు బ్రహ్మమానసపుత్త్రుఁడు. వరుణ యాగమందు యజ్ఞకుండమునుండి పుట్టినవాఁడు. ఆతఁడు త్రిలోకసుందరియు, సుగుణఖనియు, ధర్మనిరతయు నగు పులోమయను దైత్యరాజగు వైశ్వానరునికూఁతును విధ్యుక్తముగ వివాహముచేసికొని యామెయం దనురక్తుఁడై యుండెను. పులోమ, సుఖసంభోగములను బరిత్యజించి, పతిసేవాపరతంత్రయై యొప్పుచుండెడిది. కొంతకాలమున కామె గర్భము ధరించెను. ఆమె గర్భవతియైయుండినకాలమం దొకనాఁడు భృగువు స్నానార్థము బయిటకుఁ బోయియుండెను. ఆ సమయమునఁ బులోమ యొంటిపాటుగ నాశ్రమములో నుండెను. అపుడు పులోమ యను రాక్షసుఁ డా యాశ్రమములోనికి వచ్చెను. ఆ ట్లాశ్రమములోని కతిథియైవచ్చిన యా రక్కసునకు భృగుపత్ని యాతిథ్యమొసంగి కందమూలఫలంబుల నాహారమిడి సత్కరించెను.

భృగుపత్ని, పులోమ, పసిబాలికగా పితృగృహమున నున్నకాలమం దొకనాఁడు యేడ్చుచుండఁగా, నాయేడుపును మానుపునిమిత్త మాపెతండ్రి వైశ్వానరుఁడు ఆపెకు భయముఁ గొలుపుచు, "ఓరీ! రాక్షసా! ఈపిల్ల యేడ్చుచున్నది. కాఁబట్టి, దీనిని బట్టుకొనిపొ"మ్మని బిగ్గరగావలచెను. ఆయలుపు నాలించి పులోమయనురాక్షసుఁడు, వైశ్వానరగృహంబున కరుదెంచి, "ఈకన్యను నేను వరించితిని. ఇది నాభార్య" యని చెప్పి

పోయెను. పిమ్మట నాబిడతండ్రి యాపెను భృగుమహర్షి కొసంగి, విధ్యుక్తముగ, నగ్నిసాక్షికముగఁ బరిణయ మొనరించెను. పరిణయానంతరము పులోమ భృగుమహర్షితోఁగూడ నాశ్రమవాసమొనర్చుచు గర్భవతియైయుండుతఱి నొకనాఁడు, మహర్షి యింటలేనిసమయమున నారాక్షసుఁ డాశ్రమమున కరుదెంచి యామెవలన నతిథిసత్కారములు పడసినవాఁడయ్యెను.

అట్లాశ్రమమున కరుదెంచి భృగుపత్నిచే పూజితుఁడైన యారక్కసుఁడు, పూర్వపరిచితయగు నాసుందరాంగి నొంటిమె యినుండుటఁజూచి, కామపీడితుఁడై యుబ్బుగొని, యాచెలువఁ గొనిపోవ మదినెంచెను. గాని, మున్ను తావరియించియున్న పులోమ యీపులోమ యగునా, కాదా యనుసంశయ మొండాతనిహృదయమునఁ బొడసూపెను. అంత నాతఁడు సంశయనివారణార్థము, అగ్నిహోత్రశాలయందు ప్రజ్వలితుఁడగుచున్న జ్వాలమునిఁ జూచి "ఇది మున్నెవనిచేత వరియింపఁబడినది? మొదట నెవనిభార్యయైనది సత్యమడుగుచున్నాను. యథార్థమును చెప్పుము. నేనుగదా మొదట నీవరవర్ణిని భార్యగా వరియించినవాఁడను. పిమ్మట మాటనిలుకడలేని దీనితండ్రి ధర్మమును బోఁద్రోచి, దీనిని భృగువున కొసంగినవాఁడు ఈసుందరి నాభార్యయైయుండఁగా భృగువు దీనిని బొందినపక్షమున నిదినాకెంతయు సమ్మతముగాదు. నేనోర్వఁజాలను. నాహృదయము దహించుచున్నట్లున్నది. కాన, దీనినిప్పుడే కొనిపోయెదను" అని పలికెను. అంతట నగ్ని దేవుఁడు కడుదుఃఖితుఁడై సత్యమును జెప్పితినేని నన్ను భృగుమహర్షి శపియించును. అసత్యమును జెప్పితినేని అనృతదోషము నన్ను వరియించును" అని భృగుశాప

మునకును అపత్యదోషమునకును భయమొందుచు "రాక్షసే శ్వరా! ఈపులోమ మొదట మాటవరుసకు నీకొసంగఁబడినది. ఆదికారణముగ నీవు వరించినయది. అయినను మంత్రయుక్త ముగా నీవు వరింపలేదు. పిమ్మట దీనితండ్రి దీనిని భృగువున కొసంగినాఁడు. భృగువు నన్ను సాక్షిగా నున్నిదుకొని విధిపూ ర్వకముగ మంత్రయుక్తముగ వివాహము చేసికొనెను. ఇట్లీ పెను భృగుభార్యగా నెఱుంగుచున్నాను. నే నసత్యమును జెప్పనొల్లను." అనిచెప్పెను. అగ్ని చెప్పినది విని యారక్కసుఁడు, ముదమొందుచు, పందిరూపమును దాల్చి వాయువేగమనో వేగముల నాసుందరాంగిని బట్టుకొనిపోయెను. అంత పులోమ గర్భస్థుఁడై పెరుగుచున్న బాలుఁడు ఆనిశాచరుని సంరంభము నకు ననుచితవర్తనమునకుఁ గుపితుఁడై రోషమున తల్లిగర్భము నందుండి చ్యవనుఁ(చ్యుతుఁడు. జాఱినవాఁడు) డయ్యె. అందు వలన నాబాలుఁడు చ్యవనుఁ డనుపేరుగలవాఁ డయ్యెను. తల్లి కడుపునందుండి చ్యుతుఁడైన యాబాలుఁడు ప్రళయకాలసదృ శుఁడై ప్రజ్వలజ్వాలాసన్నిభములైన రూక్షేక్షణముల నా రక్కసునిపైఁ బాఱఁజేసెను. ఋషికుమారుని క్రోధాగ్నికా రా క్షసుఁ డింధనమై యాక్షణముననే పులోమను విడిచి నేలఁబడి భస్మీభూతుఁడయ్యెను. అంతట పులోమ, భృగుకులానందకరుని, నవజాతకుమారుని, చ్యవనుని దీసికొని దుఃఖమును మిక్కిలిగఁ బొందుచు నాశ్రమమునకుఁ బోయెను. ఆసమయమునఁ బితా మహుఁడు హిరణ్యగర్భుఁ డుపస్థితుఁడై యేదోషమును బొందని భృగుపత్నిని, కన్నీరుమున్నీరుగా రోదనము చేయుచున్న శీల వతిని, తనకోడలిని పులోమను నూరార్చెను. ఆచెలువ కన్నీటి ధారచే నుప్పతిల్లిన పెద్దనదిని, ఆబిడ పోయినమార్గము ననుస

రించి ప్రవహించుచున్న దానిని జూచినవాఁడాయెను. బ్రహ్మ తనవధువు (కోడలి) మార్గ మనుసరించి యాశ్రమమునకు దాపుగాఁ బోవుచున్న యానదికి 'వధూసరము' (వధువుతోడఁ బోయినది)అని పేరిడి యంతర్హితుఁడయ్యెను. భృగుపుత్త్రుఁడును తపఃప్రతాపుఁడును నగు చ్యవనుఁ డిట్లు పుట్టినవాఁడాయెను.

అనంతరము,భృగుమహర్షి యాశ్రమమునకు వచ్చి నవజాతపుత్త్రుని:చ్యవనునిఁ గాంచెను. ఉదంతమాద్యంత మెఱింగెను. పిదప నాతఁడు భార్యఁ జూచి కోపముగొని, "నిన్ను రాక్షసుఁ డెఱుఁగనే యెఱుఁగఁడు.నిన్ను వాని కెఱిఁగించినవాఁ డెవఁడు? చెప్పు"మని యడిగెను.అందులకు పులోమ,"మహాత్మా! ఆర్యపుత్రా! నన్నా రక్కసున కగ్ని యెఱిఁగించెను. అందువలన నాతఁడు, నన్ను కురరియుంబోలెఁ గూయిడుచుండ, నిర్దయుఁడై యెత్తికొనిపోయెను. అట్లు నన్ను వాఁడెత్తికొని పోవుచుండఁగా, నీపుత్త్రుఁడు కుక్షినుండి జాఱి వానిని నీఱుగావించి, నన్ను రక్షించెను." అని చెప్పెను. మొదలే కోపియగు భృగువు, పులోమ చెప్పినదివిని, మిక్కిలి కోపిష్ఠుఁడై: యగ్నిఁ జూచి, "నీవు సర్వమును భక్షించువాఁడ వగుదువుగాక" యని శపించెను.

అనంతరము భృగుమహర్షి చ్యవనువని, జాతకర్మాది సంస్కారముల సంస్కృతునిఁ గావించెను. ఋషికుమారుఁడు చ్యవనుఁడు, శుక్లపక్షచంద్రునిఁబోలె వృద్ధినొందసాగెను. సమయానుసరణముగ నుపనయనసంస్కారమును బడసెను. ఉపనయనానంతరము బ్రహ్మచర్యవ్రతదీక్షితుఁడై వేదశాస్త్రముల నధ్యయన మొనరించెను. పిమ్మట నొక సరోవరతీరమందు తపస్సు చేయుటకు ప్రవృత్తుఁడయ్యెను. అతఁడు స్థిరాసనస్థుఁడై చిరకాలము తపోనిరత నొప్పియుండుటకారణముగ, నాతని శరీ

రము తృణలతావృతమై, వల్మీకాచ్ఛాదితమై, యేరికినిఁ జూడ రానిదై యుండెను ఇట్లు, చ్యవనుఁడు దృఢసమాధిస్థుఁడై యుండుతఱి ననేకసంవత్సరములు గడచినవయ్యెను. అంతట నొకనాఁడు శర్యాతిమహారాజు, సహధర్మిణితోను, కన్యక తోను విహారోత్సుకుఁడై చ్యవనుఁడు తపంబుసలుపుచున్న సరోవరతీరస్థారణ్యమునకుఁ జనుదెంచెను. ఆసమయమున ననన్య రూపలావణ్య, రాజకన్య, సుకన్య వనసౌందర్యముఁ గనుచు, నిటునటు పరిభ్రమించుచు చెలికత్తెలతోఁగూడ భృగునందనుఁ డున్నయెడ కరుదెంచెను. అంతట నాయలోకసామాన్య సుందరీ రత్నమును జూచి, చ్యవనఋషి ముగ్ధహృదయుఁడై యామెతో మాటలాడుటకు మనసుఁగొని యామెను బలుకరింపఁజొచ్చెను. చిరకాలమునుండి నిష్ఠురతపోనిరతుఁడై శుష్కభూతుఁడై యున్న యాఋషి కంఠస్వనము సుకన్య కర్ణపుటముల నలంక రింప నేరనివయ్యెను. అట్లు చెలులతో పరిభ్రమించుచున్న సుకన్య, వల్మీకస్థూపములోనుండి మిణుగురుపురుగులవలె మెఱ యుచుఁ, గానవగుచున్న యామునికన్నులఁగని యందు కౌతూ హలవశమున కంటకములఁగ్రుచ్చెను. అంతట చ్యవనుఁడు నేత్ర వ్యథితుఁడై, రాజపరివారమును, మలమూత్రబద్ధమునుకలిగి కడుపుబ్బురోగముచేత పీడితమగునటుల శపియించెను. తత్ప్రి కారము రాజసైనికులు రోగపీడితులైరి. అట్లు సైనికులెల్లరు నొక్కపరి నొకేరోగమునకు బాలగుటఁజూచి, రాజు శోకము నకును ఆశ్చర్యమునకును లోనై "మీలో నేరైన మహర్షి భార్గవున కేదైన యపరాధమును సలిపియున్నారా" యని వారల నడిగెను; కాని, వారిలో నపరాధమును స్వీకరించినవా రేరును లేరైరి. అంతట రాజకన్య సుకన్య జనకుఁ జేరి, "తండ్రీ!

నేను వల్మీకస్థూపమధ్యమున మెఱయుచుండు రెండువస్తువులను జూచి, యావస్తువులను ముండ్లతోఁ బొడిచితిని." అని చెప్పెను. రాజకన్య చెప్పినది చెవి సోఁకినంతనే శర్యాతిమహారాజు తపోనిరతుఁడగు భృగునందనుని చెంతకరిగి, ముకుళితకరకమలుఁడై వినీతభావమున "దేవా! నాపుత్త్రిక యజ్ఞానవశమున మీకొసంగినకష్టమును క్షమించి రక్షింపుఁ"డని ప్రార్థించెను. అందులకు చ్యవనుఁడు "మహారాజా! నీపుత్త్రిక రూపయౌవనములచేత మదమత్తయై నాకవమానమును సలిపినయది. అంతియ కాదు. నాకన్నులలో కంటకములఁ దూర్చి, నన్ను నేత్రవ్యథకుఁ బాలుగావించినయది. కావున, నీవు నాకాకన్యను సమర్పింపవలయును. ఆరూపవతి నన్నుఁ బతిగాఁ జేకొనవలయును. అట్లు సేయుదువని నీసేన కారోగ్యము కలుగఁగలదు. అదియే యుపాయము. తదన్యమగు నుపాయము వేఱొండు గానరాదు." అని చెప్పెను. అంతట శర్యాతి తనకన్యఁ దోడ్కొనితెచ్చి మహర్షికి సమర్పించి, యాతనిని బ్రసన్నునిఁగావించి, నిజరాజధానికి మరలఁజనియెను. రాజకుమారి సుకన్య హర్షచిత్తయై, నిరంతరము తపోనిరతుఁ డగు పతిని దైవముగఁ బరిగణించి, శుశ్రూషలఁ దనుపుచు, అతిథిసత్కారాదికృత్యములను నిర్వహించుచు యాశ్రమవాసమును సలుపఁజొచ్చెను.

అంత కొంతకాలమునకు అశ్వికుమారు లిరువురును చ్యవనాశ్రమమున కరుదెంచిరి. వారు లావణ్యవతియగు సుకన్యను జూచి, "ఓ దేవీ! నీవెవతవు? ఎవనిభార్యవు? ఈవనమున కేల యరుదెంచితివి? మాకు నెఱిఁగింపఁదగునేని సవిస్తరముగ నెఱిఁగింపుము." అని పలికిరి. అందుల కాబిడ "నేను శర్యాతిపుత్త్రికను

భృగునందనుఁడును మహాత్ముఁడును నగుచ్యవనఋషివరేణ్యుని భార్యను." అనిచెప్పెను. అంతట నశ్వినికుమారులు, "కళ్యాణీ! ఈవనమందు సౌదామినింబోలె వెలుఁగొందుచున్న నిన్ను నీ తండ్రి యీవృద్ధమునికెటుల సమర్పింపఁగలిగెను. నిన్నుఁబోలు సుందరిమణి ముల్లోకములయందుఁ జూపట్టదు. నీవు వస్త్రభూషణములు పరిత్యజించి కేవలము నారచీరల ధరించినదానవై యుండియు, యీవనస్థలిని సముజ్వలితముగఁ గావించుచుంటివి. నీవు పలువిధములగు వస్త్రాలంకారముల నలంకృతవై యలరారుచుండునపుడు, నీసౌందర్యమునకు సామ్యమగువస్తువు జగత్తునందు దుర్లభము కాఁగలదు. ఈవృద్ధుఁడైనను నీభరణపోషణములను సక్రమముగ నిర్వహింపఁగలవాఁడుగాఁ గానఁబడఁడు. కాఁబట్టి నీవీజరాగ్రస్తుఁడగువృద్ధుని పరిత్యజించి మాలోనొకనికి హృదయేశ్వరివి గమ్ము! మేము నీమనోరథముల నన్నిఁటిని పూర్ణములు గావింపఁగలవారము." అని పలికిరి. అందులకు, మహాపతివ్రతయగు సుకన్య "దేవరులారా! పతినే ప్రాణముగఁ బరిగణించియున్న నన్ను యిట్టిఘృణితంపు వాక్కులను వినిచి యేల పరితపింపఁజేసెదరు? ఇయ్యది మీకుఁ దగదు. నాహృదయ మెన్నఁడును ఏవిధముగను పతినుండి మరలునదికాదు." అని ప్రత్యుత్తర మిచ్చెను. అంతట నశ్వినికుమారులు సుకన్యఁ జూచిఁ బ్రసన్నులై "సుందరీ! మేము నీయాచరణమునకుఁ బ్రసన్నుల మైతిమి. నీపతిని రూపయౌవనసంపన్నునిగఁ జేయుదుము."అని పలుకుచు, చ్యవనునికడకేగి "తపోధనా! మేము నిన్ను రూపయౌవనసంపన్నునిగాఁ జేయఁదలఁచితిమి. వలయునేని యీ సరోవరమున స్నానమొనరింపుము." అని చెప్పిరి అంతట చ్యవనుఁడు రూపయౌవనాకాంక్షుఁడై స్నానమాడ సరోవరము

లోనికిఁ డిగియెను. ఆతనితో నశ్వికుమారు లిరుపురుషులుఁగూడ సరోవర ప్రవిష్టులైరి. ముువ్వురును స్నానమాడి సరోవరమునుండి బయలు వెడలుఁడు, ముువ్వురు నొక్కతీరగు రూపయౌవనసంపన్నులగుయౌవనపురుషులఁబోలె గానవచ్చుచుండిరి. ముువ్వురును నొక్కతీరగు వస్త్రభూషణములచేత నలంకృతులై యుండిరి ఆముువ్వురును సుకన్యఁజూచి "చారుశీలే! మాముువ్వురిలో నీపతి యేఱో యేర్పఱుచుకొనుము." అని యేకగ్రీవముగఁ బలికిరి. సుకన్య మొట్టమొదట సమానరూప యౌవనవేష భాషాసంపన్నులగు నాముువ్వురను జూచి వికలమనస్క యయ్యెను. పిమ్మట దృఢచిత్తయై, వివేచనాన్వితయై చ్యవనమహర్షినే పతిగా నెన్నుకొనెను. అంత, చ్యవనుఁడు జరాభారపీడితుఁడై గుందు నొందుచున్న తనకు మరల రూపయౌవనసంపన్నత నొసంగి సంతసముఁగలుగఁజేసిన యశ్వినీకుమారులయెడ నత్యంతముఁ బ్రసన్నుఁడై, వారలఁజూచి, "వృద్ధుఁడనగు నన్ను మీరలు మరల యౌవనవంతునిగఁజేసితిరి. కాఁబట్టి దేవేంద్రునిసమ్ముఖమున మీచేత సోమరసమును పాన మొనరింపఁజేసెదను. అని యిదె ప్రతిజ్ఞఁ జేయుచున్నాను." అని పలికెను. అందులకు దేవవైద్యులు ప్రసన్నులై యందుండి ప్రస్థానులైరి. చ్యవనుఁడా వనములో యథేచ్ఛావిహారమును సలుపఁజొచ్చెను.

శర్యాతిమహారాజు, వృద్ధుఁడగుతనయల్లుఁడు చ్యవనుఁడు అశ్వినీకుమారులవలన, మరల రూపయౌవనసంపన్నతను యనుగ్రహింపఁబడినవాఁడని విని, రాజమహిషీసహితముగ చ్యవనాశ్రమమున కరుదెంచి, యందు రతీమన్మథులవలె చెలువొందుచున్న కూతునల్లునిఁ జూచి, యానందపరవశుఁడయ్యెను. పులకితగాత్రుఁడయ్యెను. చ్యవనుఁడును, అత్త

మాయెను, స్వాగతమొసంగి పూజించి, ఆతిథ్య సత్కార మొసంగి నానావిధములగు కథాపురాణములను వినిచి, సంతుష్టాంతరంగునిఁ గావించెను. అల్లుఁడును కూఁతురు నొసంగెడి సత్కారములను గొనుచు, వినిచెడి కథాపురాణములను వినుచు, నా రాజదంపతులు కొంతకాల మాశ్రమవాసమును సలిపిరి. అంత నొకనాఁడు, అన్యోన్యవార్తాలాప సందర్భమున చ్యవనుఁడు శర్యాతితో "మీరొక లోకయజ్ఞమును సలుపుఁడు. అందు నేను యాజ్ఞికుఁడ నగుదు"నని యనియెను అందులకు శర్యాతి యంగీకృతుఁడయ్యెను. అనంతరము శర్యాతి అల్లునిఁ గూఁతునిఁ దోడ్కొని నిజరాజధానికిఁ జనియెను. భృగునందనుఁ డాతనిని వ్రతపూర్వకముగ యాగదీక్షితునిఁ గావించెను. చ్యవనుఁ డింతకుమున్ను, అశ్వినీకుమారులచేత సోమరసమును పానమొనరింపఁ జేయుటకుఁ బ్రతినఁబూని యున్నవాఁడు. కాఁబట్టి తత్ప్రకారము యజ్ఞభాగులగు దేవతలతోఁబాటు యశ్విని దేవతలకుఁగూడ సోమరస మొసంగఁజొచ్చెను. అయ్యదిఁ జూచి, ఇంద్రుఁడు "అశ్వినీకుమారులు దేవచికిత్సకులు. సోమరసపానమున కనధికారులు. కాఁబట్టి వారల కొసంగఁ జనదు." అని నిరోధించెను. అందులకు చ్యవనమహర్షి, "స్వర్గాధిపా! అశ్వినీకుమారులు నాకు రూపయౌవనముల నను గ్రహించి నన్నమరతుల్యునిగఁ జేసిరి. అట్టివారిని సోమరస పానులుగఁ జేయుట నాకు పరమకర్తవ్యము. అయ్యది పరమ ధర్మము. అట్లు చేయకుండుట యనుచితముగాదా! కాఁబట్టి వారిచేత నిర్నిరోధముగ, నిరాటంకముగ సోమరసమును త్రాగించెదను. వారును అమరులె. వారు సోమరస పానాధికారముఁ గనినవారలే" యని బదు లొసంగెను. ఆమాటలను

ఇంద్రుండు మన్నింపఁడయ్యె. అంత చ్యవనుండు దేవవైద్యుల అంశను కొంతవరకు గ్రహియించి, "వారలిక సోమరస పానార్హులై"రని ప్రకటించెను. అందుల కింద్రుండు మరలఁ బ్రతిఘటించెను. కాని, చ్యవనుండు అశ్వినీకుమారులకు సోమరసమొసంగుటయందు స్థిరచిత్తుండై వెనుదీయకుండెను. "అశ్వినీకుమారులకు సోమరస మొసంగుదువేని, నిన్ను వజ్రాయుధమునకు బలియొసంగెద"నని యింద్రుండు చ్యవనుని బెదరించెను. చ్యవనుండు ఇంద్రుని ధిక్కరించెను. అంతట దేవరాజు క్రుద్ధుండై చ్యవనునిపై వజ్రముఁ బ్రయోగించెను. అంత భృగునందనుండు యజ్ఞకుండమునందుండి పరాక్రమవంతుఁడును మహాబలవంతుండును, వికటాకారుండును నగునొక మహాసురుని బుట్టునట్లు చేసెను. అట్లుత్పన్నుండైన రాక్షసుండు, భయంకరాకారుండై, ఇంద్రుని భక్షింపనెంచి నోరు దెఱచుకొని, యాతనివంకకుఁ బరుగిడఁజొచ్చెను. అట్లు తన పైకిఁ బరుగుపరుగున నరుదెంచుచున్న యావికటరక్కసునిఁ జూచి, యింద్రుండు భయవిహ్వలుండై "మహర్షివర్యా! దేవవైద్యులు, అశ్వినీకుమారులు నేఁడు మొదలుగ హవిర్భాగముల గ్రహియించుట కర్హులని నేను ప్రకటించుచున్నాను. క్షమింపుమ'ని చ్యవనుని పలువిధముల బ్రార్థించెను. ఇంద్రుని ప్రార్థన మంగీకరించి, భృగునందనుండు శాంతచిత్తుండై, రక్కసుబారినుండి యాతని రక్షించెను. అనంతరము, శచీధవుని, అశ్వినీకుమారులను, తదితరహవిర్భాగార్హులగు దేవతలను సోమరసపానతృప్తులఁ జేసి, శర్యాతి యజ్ఞమును పరిసమాప్తమొనరించి, పతిపరాయణను పత్నిని సుకన్యను

దోడ్కొని స్వాశ్రమప్రస్థానుఁ డయ్యెను. అదిమొదలుగ అశ్వినీ కుమారులు హావిర్భాగములను బడయువారలైరి.

చ్యవనమహర్షి, ప్రయాగలోని త్రివేణీతీర్థమందు, గంగా యమునా సరస్వతుల సంగమస్థానమందు, పండ్రెండు సంవత్సరములు నివసించి, యొకప్పుడు భూమియందు నొకప్పుడు జలమధ్యమునందును, నిలిచి ఘోరతప మొనర్చుచుండెను. అకాలమం దొకప్పుడు ఆతఁడు జలమధ్యమందు దీర్ఘసమాధిస్థుఁడై చిరకాలము నిలిచియుండినందున, జలచరము లాతనితో మైత్రిసినెఱపుకొని యాతనిచెంతఁజేరి యాతనిశరీరమును పసిగొనుచుండెడియది. ఇట్లుండ నొకనాఁడు, కొందరు ధీవరులు చేపలనుపట్టుటకై యరుదెంచి చ్యవనుఁ డున్నస్థానమందు జాలమునువైచిరి. ఆజాలములో మత్స్యములతోబాటు చ్యవనుఁడు కూడ తగులుకొనెను. వానితోపాటు ఆతఁడుకూడ బయిటకుఁ గొనితేఁబడియెను. అంతఁ జాలరులు, జాలమందు చిక్కువడి యున్న మహర్షిఁజూచి భయవిహ్వలులై బయలుపఱచి యాతనికి మాటిమాటికిని సాష్టాంగనమస్కారములు సలుపఁజొచ్చిరి. మత్స్యములు నీటినుండి వెలికిఁదీయఁబడినంతనె ప్రాణములను గోలుపోయిన వయ్యెను. మహర్షి తనకు సహచరము లగుమత్స్యముల కలవడిన యాదురవస్థఁ జూచి కడుదుఃఖితుఁ డయ్యెను. దీర్ఘనిశ్వాస పరిత్యాగుఁ డయ్యెను. ఈవిధముగ దుఃఖాక్రాంతుఁడై పరితపించుచున్న మహర్షిఁ జూచి,జాలరులు,"దేవా! తెలియక మేము చేసినపాప మేదిగలదో యద్దానిని క్షమియింపుఁడు. మీకు సంతోషమగుటకు మేమేమిపనిచేయవలయునో యాజ్ఞాపింపుఁడు." అని సవినయముగఁ బ్రార్థించిరి. అందులకు, మహర్షి "జాలరులా రా!-ఈచేపలతోబాటు నేనుకూడఅమ్ముడుపోయెదను,

లేదా, ప్రాణములనైన విడిచెదను. నేను వీనితో పెద్దకాలము నుండి నివసించుచున్నాఁడను. కాఁబట్టి వీనిని విడువనేరను." అని బదులుపలికెను. అంత ధీవరులు క్షుబ్ధులై, యేమియుఁ దోఁచక నహుషమహారాజు చెంత కరిగి, యావృత్తాంతమాద్యంతమును వినిచిరి. ధీవరులు చెప్పినమాటల నాలించి నహుషుఁడు పాశ్చర్యుఁడై, మంత్రిపురోహితసామంతవర్గంబుతో మహర్షియున్న యెడ కరుదెంచెను. అట్లరుదెంచిన నృపతిని మహర్షి యభ్యర్చితునిఁ గావించెను. అనంతరము,నహుషమహారాజు, మహర్షిఁ జూచి, "మహాత్మా! నేనేమిజేసిన మీకు సంతోషము కలుగునో యయ్యది యెరిగించి నన్నుఁ గృతార్థునిగఁ జేయుఁ"డని సవినయముగఁ బ్రార్థించెను. అందులకు భృగునందనుఁడు, "నహుష రాజేంద్రా! ఈమత్స్యములతోఁబాటు నాకును మూల్య మొసంగి నన్నును శీఘ్రముగ విలిచికొనుము." అని చెప్పెను. అంతట నహుషుఁడు, ధీవరులకు మత్స్యమూల్య మొసంగినయనంతరము, ఋషిమూల్యముక్రింద మొదట నొకసహస్రమును ఆవెనుక నొకలక్షయును స్వర్ణముద్రికల నొసంగెను. అయ్యది చూచి చ్యవనుఁడు, "నృపవరా! వేయియు లక్షయు నగుస్వర్ణముద్రికలు నన్ను విలిచికొనుటకు తగుమూల్యముగాదు. మహర్షిమూల్యము మహర్షితోఁపరామర్శించి స్థిర మొనర్పుము" అని రాజుతో ననియెను. అంత రాజు నికటవర్తులగు మహర్షుల దిక్కు మొగమై,"తపోనిధులారా! ఈమహర్షి మూల్యమును స్థిరపఱుపుఁడు" అని యడుగ, వారియం దొకమహర్షి ముందంజనిడి, "మహారాజా! తపోనిధియగు బ్రాహ్మణుఁడు అమూల్యపదార్థము. ముల్లోకములలోని బహుమూల్యరత్నముల నన్నిటిని సంగ్రహించి యొసంగినను అందులకుఁ దగుమూల్యము కానే

రము గోధనము అందులకుఁ దగుమూల్యము. అయ్యది యొసంగి విలిచికొనుము" అని చెప్పెను. మహర్షిమాటల నాలించి, నహుషుఁడు సంతసిలుచు, ధీవరులకు గోధనమొసంగి మహర్షిని విలిచికొనియెను మహర్షి మూల్యముక్రింద నహుషుఁడొసంగిన గోధనమును, ధీవరులు, భృగునందనునకు సమర్పించి, యాతని యాశీర్వాదమును బడసినవారలైరి. మహర్షి యాశీర్వచనప్రభావమువలన ధీవరులు మృతమత్స్యములతోఁ కూడ నచ్చటివారలు చూచుచుండ స్వర్లోకమున కరిగినవారలైరి చ్యవనమహర్షి యాశీర్వాదప్రభావమువలన మత్స్యములును, ధీవరులును స్వర్గలోకవాసులగుటఁ గని నహుషమహారాజు విస్మితుఁడయ్యెను. అనంతరము, చ్యవనుఁడు రాజుఁ జూచి, "వరమడుగు"మని యాదేశించెను. అందులకు రాజు, "మహర్షిశేఖరా! నాకు నిశ్చలభక్తియు, ధర్మనిరతియు దయచేసి నన్ను ధన్యునిగఁజేయుఁ"డని భక్తివినయములతోఁ బ్రార్థించెను. అందులకు భృగునందనుఁడు సంతసిలుచు, 'తథాస్తు' అని పలుకుచు, రాజు నాశీర్వదించి యందుండి ప్రస్థానుఁడయ్యెను.

కాలాంతరమున, కుశికవంశజులు తనవంశమును పౌత్రవంతముగ నొనర్చుదురనియు, దాన భృగువంశమునకు వినష్టమాపాదితము గాఁగలదనియు నను ననుమానము చ్యవనుని హృదయమునఁ బొడసూపెను. అందువలన నాతఁడు, కుశికవంశమునకు నష్టమాపాదింపనెంచి, కుశికమహారాజు చెంత కరిగి "మహారాజా! నీకడ కొలఁదిదినములు నివసింపవలయునని నామనమువ్విళ్లూరుచున్నయది. ఏమనియెద"వని యడిగెను. అందులకు కుశికుఁడు సంతోషతరంగితాంతరంగుఁడై "మహర్షి

శేఖరా! నిస్సంశయముగ వలయునంత కాలము నివసింపుఁడు. యథాశక్తిగ మీ సేవయొనర్చి ధన్యుఁడనయ్యెద"నని బదులొసంగి, యాతనిని విధ్యుక్తముగఁ బూజించెను. అంతట చ్యవనుఁడు, "మహారాజా! నీవును రాజమహిషియు నిష్ఠులగుదురేని నేను మీ ప్రాసాదమందు నివసించి వ్రతానుష్ఠానమొండొనర్చెదను. అనుష్ఠానసమయమందు మీర లకుంఠితచిత్తులరై నాకు సేవసేయవలయు. ఏమనియెద"వని కుశికు నడిగెను. అందులకును రాజదంపతు లంగీకృతులై యాతని రాజమందిరమునకుఁ దోడ్కొనిపోయి "మహర్షిశేఖరా! మీ రిందు వసియింపుచు సుఖపూర్వకముగ వ్రతానుష్ఠాన మొనరింపుఁ"డని పలికిరి. అంతట చ్యవనుఁ డానందభరితుఁడై యందు విడిసి రాత్రియైనంతనె, "రాజా! నాకాకలి యగుచున్నయది. భోజనమిడుము." అని రాజుతోఁ బలికెను. భోజనానంతరము, "మహారాజా! నాకు నిద్ర వచ్చుచున్నది. పరుండెదను. నేను నిద్రించునపుడు నన్నెవరును లేపకుండ మీ దంపతులిరువు రిందు నిలిచి చూచుచుండుఁడు." అని చెప్పి నిద్రితుఁడయ్యెను. రాజదంపతు లాహారనిద్రలనుమాని మహర్షి పరిచర్యను సేయఁదొడంగిరి. ఇట్లు చ్యవనుఁడు యిరువదియొక్క దినములు నిద్రించియుండెను. ఈ నిద్రితకాలమందు రాజదంపతు లాహారనిద్రలు లేక యేయాతనికి శుశ్రూషఁ జేయఁజొచ్చిరి అనంతరము చ్యవనుఁడు నిద్రనుండి లేచి యంతర్హితుం డయ్యెను. రాజు పత్నీయుతముగ అనాహారుఁడై యాతని రాకకుఁ బ్రతీక్షింపఁజొచ్చెను. ఎంత వెదకినను యాతని జాడ పొడసూపదయ్యెను. పిమ్మట నాతఁ డెందుండియో యకస్మాత్తుగ జనుదెంచి మరల నిద్రితుఁడయ్యెను. నిద్ర లేచి తైలాభ్యంజన స్నానమాచరింపనెంచి, రాజదంపతుల

చేత తలనంటించుకొని మరల నంతర్హితుండయ్యెను. మరలఁ జనుదెంచి భోజనమును యాచించెను. రాజమందిరమునం దుపస్థితములై యున్న పలువిధములగు ఖాద్యపదార్థములను, తదితరపదార్థములను ఏకత్రమొనరించి వానినన్నిటిని హుతాశనుని కర్పించెను. అటుల మహర్షి చేసినందులకు రాజేమియు ననఁడయ్యె. అనంతరము చ్యవనుఁడు, కుశికుని విచలితహృదయునిఁ గావించుట కొకయద్భుతమగు నుపాయము నావిర్భావమొనరించెను. తానొక పల్లకియందు కూర్చుని రాజదంపతులను తద్వాహకులుగ నియుక్తులం గావించెను. తన్నియుక్తమున రాజదంపతులు వాహకులై యాపల్లకిని మోయుచుండ, యామహర్షి వారి సుకుమారశరీరములపై, మాటిమాటికిని కశాఘాత మొనరింపఁజొచ్చెను. అట్లు కశాఘాతమున క్షతవిక్షతగాత్రులగుచున్న రాజదంపతులు, మునిపల్లకిని మోయుటయందే దృఢచిత్తులై యుండిరిగాని, తదాచరణమున కించుమంతయు విసుగుజెందినవారలు కారైరి. అంతట చ్యవనుఁడు రాజకోశములోని ధనమును యిచ్ఛావితరణ మొనర్చెను. అందులకును రాజదంపతులు సంతసిలిరేగాని, యసమ్మతమును ప్రకటింపరైరి. ధనాగారము శూన్యమైనదైనను కుశికుఁడు విచలితహృదయుఁడు కాలేదు.

చ్యవనుఁడు, తానెన్నివిధముల నిగ్రహీతునిఁ గావించినను కుశికుఁడు తనయెడ విరక్తుఁడు కాకుండుటనుఁ జూచి, అమందానందహృదయుఁడై, యాతనిఁజేరి, "మహారాజా! నేను నీయెడఁ గడుఁబ్రసన్నుఁడనైతిని. నీవు, నేఁడు పత్నీయుతముగఁ జని భోజనమొనర్చి విశ్రాంతిఁజెందుము. మఱునాఁడు రేపకడ నాకడ కరుదెమ్ము" అనిచెప్పి నిజాశ్రమమునకుఁ జనియెను.

అంతట ననేకదినములనుండి, మునిపరిచర్యయందు దగిలి నిద్రాహారములను దూరమొనర్చియున్న రాజును రాణియు తదాదేశమున భోజనభాజనములఁ బరితృప్తులై నాఁడు సుఖనిద్రఁజెంది స్వస్థచిత్తులైరి మఱుసటిదిన ముదయమున మహర్షిసందర్శనమునకునై తదాశ్రమప్రాంతమున కరుదెంచిరి. రాజదంపతులరుదేరునంతకు చ్యవనాశ్రమము సుందరనగరముగను, తత్పర్ణశాల మహావైభవ సమన్వితమగు అట్టాలికగను పరివర్తనమైయుండెను ఆయట్టాలికయందొకసుందరమును, మృదుతరమును నగుశయ్యపై చ్యవనుఁడు శయనించియుండెను. అట్లు శయనించియున్న మహర్షిని రాజదంపతులు దగ్గరిలినంతనె, యాశయ్యయు నాయట్టాలికయు, యానగరమును అంతర్ధానములయ్యెను. చ్యవనుఁ డొకదర్భాసనముపై నుపవిష్టుఁడైనవాఁడయ్యెను. చ్యవనుని యాయద్భుత తపోబలప్రభావముఁ జూచి యా రాజదంపతులు విస్మయానందములకు లోనుగాఁ జొచ్చిరి. మహర్షియెదుట నిలువఁజొచ్చిరి. అట్లు ముకుళితకరకములై సవినయభయభక్తులతో కట్టెదుర నిలిచియున్న రాజదంపతులను, చ్యవనుఁడు యథావిధిని సత్కరించి యాసీనులఁగావించెను. అనంతరము రాజుఁ జూచి, "కుశికనృపవరేణ్యా! ముందు ముందు నీవంశజులు, నావంశమందు క్షాత్ర తేజమును సంచారమగునటుల జేయుదురనియు, అందువలన భృగువంశము వినష్టమగుననియును మున్నొకప్పుడు బ్రహ్మవలన వినియుంటిని. అందువలన నీవంశమును మూలచ్ఛేదమొనర్చి, భృగువంశమును పెంపొందఁజేయ మదినెంచి, నీకడకరుదెంచి, నీమందిరమున నివసించితిని. నీయందు త్రుటిగని నిన్ను శాపదగ్ధునిగాఁజేయుటకు నిన్ను, బలువిధములుగా బాధించితిని. కాని లోపమును

గన్నైతిని. నీపుత్రునకు, గాధిరాజునకు ఋచీకమహర్షి ప్రభావమువలన విశ్వామిత్రుఁ డనుపుత్రుఁడు, కులపావనుఁ డుత్పన్నుఁడగును. అతఁడు కఠోరతపమొనర్చి బ్రహ్మను ప్రసన్నునిఁ గావించి, యాతనివలన బ్రాహ్మణత్వలాభమును బడయఁగలవాఁడగును. నేను మీరొనర్చిన పరిచర్యలకుఁ బ్రసన్నుండనైతిని. మీకు శుభమగుఁగాత!" అని యాశీర్వదించి యాతని యనుమతిఁబడసి తీర్థాటనమునకుఁ బ్రస్థానుఁడయ్యెను.

భృగుపుత్రుఁ డగుచ్యవనుఁడు సుకన్యయందు ప్రమతి యనుపుత్రునిఁ గనియెను. అతఁడును, తండ్రిఁబోలె, తపస్సు చేయుటయందును తేజస్సునందును, గణుతికెక్కినవాఁడు.



## 10. అగస్త్యమహర్షి.

అగస్త్యుని జన్మవృత్తాంతము అత్యద్భుతము. మిత్రావరుణుఁ డనుమహర్షి యొకదినమున నపూర్వసౌందర్యశాలిని యూర్వశినిఁ జూచినంతనే వీర్యపతనమునకు లోనయ్యెను. అతఁడాపతితవీర్యము నొకకుంభ (ఘటము)మునం దునిచి సంరక్షించెను. అట్లు కుంభమం దునుపఁబడి రక్షితమైన వీర్యమునుండి యగస్త్యుఁ డుద్భవమందెను. కుంభమునందుండి యుదితుఁడైన కతమున నగస్త్యునకు 'కుంభజుఁ':డనుపే రలవడెను కుంభజుఁడు మహాతపశ్శాలి. అతఁడు, తనతపోబలమువలన పెక్కులౌకిక కార్యములను సలిపి లోకోపకార మొనర్చియున్నవాఁడు. అతఁడు సాంసారికజీవనమునందు విరక్తుఁడై చిరకాలము బ్రహ్మచర్యవ్రతావలంబి యై నిరంతరము తపోనిమగ్నుఁడై

యొప్పియుండెను. అతఁడు భూప్రదక్షిణ మొనర్చుచుండుతఱి నొకనాఁ డొకశాఖాగ్రమును బట్టుకొని తలక్రిందుగా నొక పెనుపల్లములోనికి వ్రేలాడుచున్నవారలఁ గని, కరుణార్ద్రహృదయుఁడై, వారల దరిసి, "అయ్యలారా! మీరలెవరు? ఈ విధముగఁ బడియుండుటకుఁ గారణమేమి?" అని ప్రశ్నించెను. అందులకు వారలు "మేము నీపితరులము. నీ వవివాహితుఁడవై యుండుటకారణముగ, మే మీదుర్దశకు లోనైతిమి. నీవు వివాహితుఁడవై సంతానోత్పాదన మొనర్చువాఁడ వగుదువేని మావంశవృక్షము రక్షణమును బడయఁగలదు. దాన మాయీ యసహ్యకష్టము తొలఁగఁగలదు. అని ప్రత్యుత్తర మొసంగిరి. పితరులమాటల నాలించినంతనె వారికష్టమును బాప మదినెంచి వారియెదుట నగస్త్యుఁడు "నేను వివాహితుఁడనై పుత్రోత్పాదన మొనర్చి మీకష్టమును బోద్రోలుదు"నని కృతప్రతిజ్ఞుఁడై యందుండి వెడలి చని విదేహరాజకన్యను త్రిలోకసుందరిని, లోపాముద్రను, దానపూర్వకముగఁ గ్రహించి విధ్యుక్తముగఁ బరిణీతుఁ డయ్యెను. అనంతరము లోపాముద్రాసహితముగ గంగాద్వారమందలి తనయాశ్రమమున కరిగెను. రాజకుమారి లోపాముద్రయు, తపస్విశ్రేష్ఠుఁ డగువగస్త్యుని బతిగాఁ బడయఁ గలిగినందులకు అత్యంతసంతోషమును బొందినయది. లోపాముద్ర యాశ్రమమున కరుదెంచినపిమ్మట బహుమూల్యాభరణములను, సూక్ష్మవస్త్రాదులను పరిత్యజించి, అజినవల్కలములను ధరియించి తనపతికనుకూలవతి యగుసహధర్మచారిణియయ్యెను. అట్లు కొంతకాల మరిగినపిమ్మట నొకనాఁడు అగస్త్యుఁడు ఋతుస్నాతయగుసహధర్మిణిఁ జూచి కామవికారమునకులోనై తన మనోభిలాష మామె కెఱింగించెను. అంత నాసాధ్వీశిరోమణి

లోపాముద్ర భర్తచెంతకరిగి నిలిచి, లజ్జావనతవదనయై, ముకుళితకరకమలయై "ప్రాణనాథా! మీయాజ్ఞ నాకు శిరోధార్యము. అయినను తపస్విజనసేవ్యము లగునీపవిత్రగైరికవసనమును, అజినమును ధరియించి యీపవిత్రపదార్థముల మర్యాదను వినష్టమొనరించి మిమ్ముల నెటులఁ దనియింపఁజేయఁగలదాన నగుదును? నేను, పితృగృహమునం దుండినపు డేవిధముగ నమూల్యవస్త్రాభరణములను ధరియించి బహుమూల్యశయ్యపై శయనించియుంటినో ఆవిధముగ నమూల్యవస్త్రాభరణములను ధరియించి బహుమూల్యశయ్యపై శయనించి మిమ్ములను దనియింపఁజేయవలయునని నామనోరథము." అని సవినయముగఁ బలికెను. అందులకు మహర్షి "యో ప్రియతమురాలా! నీమనోరథము దరిద్రునిమనోరథమును బోలినయది. నీతండ్రి నరపతి. అందువలన నాతనియింట నుండినపుడు నీకట్టి వస్త్రాభరణములును, మృదుతరశయ్యయును సంప్రాప్తములయ్యెను. నేనన్ననో తపస్విని. నిరుపేదను. అట్టి వస్త్రాభరణములను శయ్య నెటుల తేఁగలను" అని బదులొసంగెను. అయ్యది యాలించి లోపాముద్ర "మీరు ముల్లోకములలోని ధనమును సంపూర్ణముగఁ బడయఁగల సమర్థులగు" అని యనియెను. అందులకు మహర్షి "నేనటులఁ జేసితినేని నాతపస్సంతయు నష్టమగును. అటుల కాకుండ ధనమును బడయుటకు అనువగుయత్న మొనర్చెద" నని చెప్పెను. అనంతరము శ్రుతర్వరాజుచెంత కరిగెను. శ్రుతర్వుఁడు మహర్షిని యథోచితసత్కార మొనర్చి అర్ఘ్యపాద్యాదివిధులఁ బూజించి పరితుష్టుని గావించి, యాగమనకారణమును నెఱిఁగింపుఁ"డని ప్రార్థించెను అందులకు ధనార్థినై యరుదెంచితి"నని మహర్షి బదులొసంగెను. శ్రుతర్వుఁడు

మహర్షికి వలయు ధనముపరిమితిని గ్రహియింపనేరక తన రాజ్యము ఆయవ్యయసర్వస్వమును దెలిపెడిపట్టికను గొనితెచ్చి మహర్షిసమ్ముఖమున నిడి, "ఇది నా రాజ్యాదాయము. ఇది వ్యయము. ఇదె శేషము. ఇందు మీకు వలయునది నిస్సంశయముగ గ్రహియింపుఁడు" అని పలికెను. శ్రుతర్వుఁడు చూపిన ఆయవ్యయపట్టికఁజూచి, మహర్షి "యీతనికడనుండి ధనమును గ్రహియించితినేని యీతని కమితకష్టమును నాపాదించినవాఁడ నగుదు"నని తనలోఁ దా ననుకొనుచు,ధనమును గ్రహియించుట కసమ్మతమును బ్రకటించుచు, శ్రుతర్వుని వెంటఁగొని బ్రధ్నశ్వునికడ కరిగెను. బ్రధ్నశ్వుఁడును ఆయవ్యయపట్టికను మహర్షికిఁ జూపెను. అగస్త్యుఁ డాతనికడనుండియు, ధనమును గ్రహియించుట కియ్యకొనక, యాతనిఁ గూడ దోడ్కొని త్రసదస్యునికడ కేగెను. ఆతని రాజ్యావస్థయు మహర్షి మనమును నలరింపనేరనిదయ్యెను. అంతట అగస్త్యుఁడు నిరుత్సుకుఁ డయ్యెను. అగస్త్యుని నిరుత్సాహమును, శ్రుతర్వ బ్రధ్నశ్వ త్రసదస్యులుఁ జూచి,"ఇల్వలుఁడు మహైశ్వర్యశాలియై యున్నవాఁడు. ఆతనికడ కరిగిన మీమనోరథ మీడేరఁగల"దని మువ్వురు నేకగ్రీవముగఁ బలికిరి. అందులకు మహర్షి సంతసిలి యామువ్వర రాజులఁ దోడ్కొని యిల్వలుని చెంత కరిగెను.

ఇల్వలుఁడు మణిపురనామకస్థానమందు నివసించువాఁడు. మహాధనికుఁడు. ఆతనికి వాతాపి యనునతఁడు కనిష్ఠసోదరుఁడు. ఆయిరువురును దురాత్ములు, లోకకంటకులు. అందు నిల్వలుఁ డొకనాఁ డొక తపోనిరతుఁ డగుబ్రాహ్మణునిఁ జూచి "తనకు నింద్రునిఁబోలు కొమరునొకని దయసేయు"మని

యాతని నిర్బంధించెను. అందుల కాబ్రాహ్మణుఁ డియ్యకొనని కతమున నిల్వలుఁడు కుపితుఁడై బ్రహ్మవంశమును విధ్వంసమొనరింప మదినెంచెను. ఆతఁడు తనకడ కరుదెంచిన ప్రతి బ్రాహ్మణుని పూజితునిఁగావించి తనసోదరుని వాతాపిని మేఁకగ నొనర్చి, యీ మేఁకను వధించి దానిమాంసమును పచనముచేసి యాబ్రాహ్మణునకుఁ గుడువఁబెట్టి యనంతరము "వాతాపీ, త్వరగరమ్ము"యని పిలుచుచుండెడివాఁడు. అట్లు పిలిచినతోడనే, వాతాపి తన్ను భక్షించిన బ్రాహ్మణుని పొట్టచీల్చుకొని సజీవుఁడై యన్నయెదుట నుపస్థితుఁ డగుచుండెడివాఁడు. పిమ్మట నా యిరువు రన్నదమ్ములు ఆబ్రాహ్మణుని భక్షించుచుండెడివారు. ఈవిధముగ నిల్వల వాతాపులిరువురు నిరంతరమును నిర్భయముగ బ్రాహ్మణవధమును సలుపుచుండెడివారు.

ఇల్వలుఁడు తనకడ కరుదెంచిన యగస్త్యమహర్షిని శ్రుతర్వబ్రధ్నశ్వత్రసదస్యులను సత్కరించి విధ్యుక్తముగఁ బూజించెను. అనంతరము వాతాపిని మేఁకనుజేసి వధించి యామాంసమును పచనముచేసి మునికిఁ గుడువఁబెట్టెను. ముని భోజనము పూర్తియగుఁడు, నిల్వలుఁడు తనసోదరుని వాతాపిని యథాపూర్వముగ బిలువఁదొడంగెను. అట్లు పిలుచుచున్న యిల్వలుని యగస్త్యుఁడుచూచి యపహాసమొనర్చుచు, "నో దానవోత్తమా! ఇఁక నేఁటివాతాపి ఆతఁడు నాజఠరాగ్నికింధనమై యింతకుమున్నే యమపురి నలంకరించియున్నవాఁడు. ఇక నాతఁడు వచ్చుటయేడ?" అని పలికెను. అగస్త్యుని యాయఖండశక్తిఁ గని యిల్వలుఁడు భయకంపితుఁడై యాతనికి యథేష్టముగ ధన మొసంగెను. మువ్వురరాజులను బహుతరముగ బహూకరించెను. కారణాంతరమున నిల్వలుఁడు గూడ

మహర్షి క్రోధాగ్ని కింధనమై, భస్మీభూతుఁ డయ్యెను. అనంతర మగస్త్యుఁడు శ్రుతర్వబ్రధ్నశ్వత్రసదస్యులనుమువ్వురను తమ తమరాజ్యముల కనిపి తానుస్వాశ్రమమున కరుదెంచి భార్యకు వలయు వస్త్రాభరణాదుల నొసంగి పూర్ణమనోరథుఁ డయ్యెను. లోపాముద్ర గర్భవతియై యథాసమయమున దృఢదస్యుఁ డను పుత్రుని, ధర్మాత్ముని బ్రసవించెను. ఈధార్మికపుత్రుని జన్మము కారణముగ నగస్త్యుఁడు పితౄణమునుండి విముక్తుఁడయ్యెను.

ఒకప్పుడు కాలకేయనామకులు, దుష్టరాక్షసులు, వృత్రాసురుని యధ్యక్షునిగఁగొని యింద్రాదిదేవతలను నాక్రమింపఁ దొడంగిరి. ఇంద్రాదులు వృత్రాసురునిధాటి కెదురుపడనేరక బ్రహ్మచెంతకరిగి మొరలిడఁజొచ్చిరి. అంత బ్రహ్మ ప్రసన్నుఁడై దేవతలతో, "మీరరేగి సరస్వతీతీరమందు తపంబుసలుపుచున్న దధీచిఁ బ్రసన్నునిఁగావించి యాతని శరీరములోని యెమ్ము కనుబడసి యద్దానిఁ గొనితెచ్చి దేవశిల్పి కొసంగుఁడు. అతఁడాయెమ్ముకతో వజ్రాయుధమును నిర్మించు. ఆయాయుధము సాధనముగ నింద్రుఁడు వృత్రాసురుని వధియించు పొండు" అనిచెప్పెను. బ్రహ్మ యాజ్ఞానుసరణముగ దేవతలు దధీచి యెముకఁ గొనితెచ్చి దేవశిల్పి కొసంగిరి. దేవశిల్పి యాయెమ్ముకతో వజ్రాయుధమును నిర్మించి యద్దాని నింద్రున కొసంగెను. ఇంద్రుఁ డాయాయుధమును సాధనముగఁగొని వృత్రాసురుని వధియించెను. వృత్రాసుర వధానంతరము కాలకేయులు అధ్యక్షహీను లయినందున చెల్లాచెదరై పరుగిడి, సముద్రమధ్యముఁజొచ్చి యందు డాగికొనిరి. అనంతరము ముల్లోకముల నాశనమొనర్చుటకు స్థిరచిత్తులైరి. బ్రహ్మాంశము విధ్యంతమైనయెడల ముల్లోకములు తమంతటతామే నాశనములుగాఁ

గలవని మనోదలంచి మునుముందు బ్రాహ్మణులను విధ్వంస మొన రింపఁదొడంగిరి. వారు పగటిపూట సముద్రములో డాఁగుచు రాత్రిపూట బయలువెడలి తపోనిరతు లగు బ్రాహ్మణులను మహార్షులను నాక్రమించి వధింపఁజొచ్చిరి. ఒకనాఁడు వశిష్ఠాశ్రమముచు,మఱియొకనాఁడు చ్యవనాశ్రమముచు,ఇంకొకనాఁడు భరద్వాజాశ్రమమును ఆక్రమించి యందలి ఫలమూలాహారులను, వాయుభక్షులును నగుతపోనిధులను పెక్కువేలమందిని బోరిగొనిరి. కాలకేయులొనర్చు నుపద్రవములకు లోనై ఋష్యాశ్రమములు జనశూన్యము లయ్యెను. జపతపములు మృగ్యము లయ్యెను. దేవపూజలు పూర్ణానుస్వారము లయ్యెను అగ్నికార్యము లడుగంటెను యజ్ఞయాగాదులు స్వప్నసదృశము లయ్యెను. ఈదుష్టరాక్షసులబారిఁ బడనివారలు ప్రాణరక్షణాతురులై క్రూరమృగశరణ్యము లగునరణ్యములను కొండగుహలను నాశ్రయించి దినములుగడపఁజొచ్చిరి అంతట దేవతలు తమతమ యస్త్రశస్త్రములను చేనంది కాలకేయులను వధింప నుద్యుక్తులైరి. కాని, వారు కంటఁబడినగదా? ఆరక్కసులు సముద్రమధ్యమున నిరవుకల్పించుకొని యుండినకతమున వారలను గనుఁగొననేరక దేవతలు శ్రీమన్నారాయణుని శరణుచొచ్చిరి. కాలకేయులు లోకముల నలయించుచున్నవిధమును వినిపిరి అంత నార్తజనశరణ్యుఁడు, శ్రీమన్నారాయణుఁడు లోకరక్షణకౌతూహలుఁడై, దేవతలఁ జూచి, "కాలకేయులు సముద్రగర్భమునఁ డాగియున్నవారు. వారిఁ బోరిఁగొనుట సామాన్యముగాదు. సముద్రము జలశూన్యమయిననగాని వారు బయలుపడరు. సముద్రమును యింకించుసామర్థ్యము అగస్త్యునకుఁదక్క తదితరులకు లేదు. కాఁబట్టి మీరు లగస్త్యమహార్షి

చెంతకరిగి యాతనిఁ బ్రసన్నునిఁజేసి యాతనిచేత సముద్రుని శుష్కింపఁజేయుఁడు. అటులఁజేయుదురేని మీరలు వారలను నురుమాడ శక్తులరగుదురు" అని చెప్పి వారలను పనిచెను. దేవతలు శ్రీకాంతునియాజ్ఞను శిరమున ధరియించి యగస్త్యుని చెంతకరిగి యాతనిఁ బ్రసన్నునిఁ గావించిరి. అగస్త్యుఁడు సముద్రమును పానముచేసెను. కాలకేయులు బహిర్గతులైరి. దేవతలు వారలఁ దలపడిరి. దైత్యాదిత్యులకు ద్వంద్వయుద్ధము ప్రవర్తిల్లెను. ఆద్వంద్వయుద్ధమున పెక్కండ్రు కాలకేయులు నిహతులైరి. హతశేషులు ప్రాణరక్షణాతురులై పాతాళముకుఁ బరుగిడిరి. దేవతలు విజయమును బడసిరి. పృథ్వి నిరాపదయయ్యెను. లోకములు నిష్కంటకములయ్యెను. జపతపములు, యాగాదులు పునఃప్రవర్తితము లయ్యెను. ఇంద్రాదులగస్త్యుని బహుతరముగ స్తుతియించి యాతనిని స్వాశ్రమమున కనిపి తాము స్వర్లోకమును బొందిరి.

ఒకప్పుడు, వింధ్యుఁడు సుమేరువునెడ క్రుద్ధుఁడై, సుమేరువునకు ప్రతినిత్యమును పరిక్రమమొనర్చుచున్న సూర్యనారాయణునిఁజీరి "నేఁడుమొదలుగ సుమేరువును మాని నన్ను ప్రతినిత్యమును చుట్టుతిరుగుచుండుము" అని చెప్పెను. అందులకు సూర్యుఁడు, "నేను నాబుద్ధిపూర్వకముగ మేరువు చుట్టు తిరుగుచుండుట లేదు. విధాతృనాజ్ఞచొప్పునఁ దిరుగుచున్నాఁడను"అనిబదు లొసంగెను. అంతట వింధ్యుఁడు కుపితుఁడై, సూర్యగమనమును నిరోధింప మదినెంచి తనశరీరమును పెంచి పెద్దదిగఁగావించెను వింధ్యునిశరీరము హద్దుమీరి పెరిగినందున సూర్యగమనము నిరుద్ధమయ్యెను. అందువలన లోకములు పీడితములుగాఁజొచ్చెను.అయ్యది చూచి త్రిదశులు దిగులొంది అగ

స్త్యుని చెంతఁజేరి వింధ్యవర్తనమును వినిచి శోకసంకటమును బాపవేఁడుకొనిరి అంతట నగస్త్యుఁడు దేవతానురోధముచొప్పున వింధ్యపర్వతము చెంతకరుగ, నప్పర్వత మమ్మహర్షికి దండాకృతిగ నమస్కరించెను అట్లు సాష్టాంగనమస్కృతి నొసంగుచున్న వింధ్యునిఁ జూచి, కుంభజుఁడు ప్రహర్షచిత్తుఁడై "యోపర్వత శ్రేష్ఠమా! నేను దక్షిణయాత్ర కరుగుచున్నాఁడను. నీవు నిలిచి యుండినయెడల నిమ్నోన్నతములగు నీశిఖరములను దిగుట యందు నెక్కుటయందును నాకమితసంకటము సంప్రాప్తమగు. కాఁబట్టి నేను దక్షిణదిశనుండి మరలివచ్చునంతదనుక నీవీవిధముగనే దండాకృతిగ నొప్పియుండుము" అని వింధ్యుని శాసించి, సూర్యగమనమును నిర్నిరోధముగ వర్తిలఁజేసి దక్షిణదిక్కున కరిగెను. ఆతఁడందుండి మరలిరాలేదు. దక్షిణమునుండి యుత్తరమున కరుదెంచిన వింధ్యుఁడు యథాపూర్వముగ లేచినిలిచి లోకోపద్రవ మొనఁగూర్చునని, యగస్త్యుఁడు దక్షిణదేశవాసి యయ్యెను

బ్రహ్మవంశసంభూతుఁడును తపోబల సంపన్నుఁడును, మహాపరాక్రమశాలియు నగువృత్రాసురుని వధియించుట కారణముగ నింద్రుఁడు బ్రహ్మహత్యాపాతకమునకు లోనయ్యెను ఇంద్రుని కలవడినపాతకము మూర్తివంతమై, చండాలినీ రూపధారిణియై, యాతని వెనుదగిలి దిరుగ నారంభించెను అట్లు భయంకరాకారమునఁ దన్ను వెన్నంటి దిరుగాడుచున్న బ్రహ్మహత్యాపాతకమునుగని యింద్రుఁడు భయకంపితుఁడై మానససరోవరమునందలి యొకానొక కమలనాళమునుజొచ్చి యందు డాగికొనియెను. అంతట స్వర్గము రాజహీనమయ్యెను దానఁ దేవగురువు బృహస్పతి యనుమతి

చొప్పున దేవతలు నహుషుని స్వర్గాధిపునిఁ గావించిరి నహుషునకు స్వర్గాధిపత్య మలవడినంతనె యాతనిమతి భ్రమసినదయ్యెను ఆతఁడు ఇంద్రాణిని పత్నిగఁ బడసినఁగాని, తనకలవడిన స్వర్గాధిపత్యము సౌఖ్యదాయకము కాఁజాలదని నిశ్చయించి, యింద్రాణిచెంతకేగి, యామెను, తన్ను పతిగ వరియింపుమని నిరోధించెను. నహుషుని దుర్వర్తనమును గని, యింద్రాణియు దేవతలును భయగ్రస్తులై బృహస్పతిచెంతకరిగి యాతనికి శరణుచొచ్చిరి. అంతట బృహస్పతి నహుషునిఁ జీరి, "మహారాజా! స్వర్గాధిపా! మహర్షి వాహితమగు వాహనము నధిరోహించినఁగాని నీకు నింద్రత్వము సిద్ధింపనేరదు. ఇంద్రత్వము సిద్ధించినఁగాని, నిన్ను నింద్రాణి పతిగ వరియింపనేరదు కాఁబట్టి, ఋషివాహితమగు వాహనమును నధిరోహించి యేనాఁడుఇంద్రాణిగృహమున కరుదేరఁగలవాఁడవగుదువో, అనాఁడు ఇంద్రాణి నిన్ను పతిగ వరియింపఁగలదు" అని చెప్పెను. బృహస్పతిపలుకుల నాలించి నహుషుఁడు సంతోషతరంగితాంతరంగుఁడై, కామమదమత్తుఁడై, మహర్షులనే కత్రులఁగావించి తానొకపల్లకిలోఁగూర్చుండి, యద్దానినిమోయునటుల నమ్మహర్షుల కాజ్ఞనొసఁగెను. రాజాజ్ఞను శిరోధార్యమొనరించి మహర్షు లాతని పల్లకినిమోయఁదొడంగిరి. కాని పల్లకిమోతయందు నభ్యాసములేని యామహర్షు లద్దానివలన కలుగుచున్న కష్ట మసహ్యమగుచున్నదైనను సహ్యమైనదానిగ మదిఁదలంచి మందగమనమున నడువసాగిరి. అందులకు మదోన్మత్తచిత్తుఁడగునహుషుఁడు సహింపనేరక వారలను త్వరపెట్టుచు సర్ప. సర్ప. అని కేకలువేయుచు భయపెట్టసాగెను; కాని మహర్షులు త్వరితగమనులు కాఁజాలకపోయిరి. అంతట నహు

షుఁడు అగ్రహోదగ్రుఁడై యెదుటనున్న యగస్త్యుని పదతాడి తునిఁ గావించెను. అట్లు పదతాడితుఁడైనయగస్త్యుఁడు దండ తాడిత భుజంగమముచందమున క్రుద్ధుఁడై, "యోదురాత్మా! కామమదమత్తా! పూజ్యపాదు లగుమహర్షులను పూజించుటకు మాఱుగ వారిచేత పల్లకినిమోయింపఁ జేయుటయేకాక వార లను దండనార్హులుగఁగూడఁ జేయుచున్నాఁడవు. నీ యీయను చితవర్తనమున కుచితదండన మొసంగకుండ విడిచిపుచ్చుట యుచితవర్తనము కానేరదు. సర్ప. సర్ప. అని కేకలువేయుచు మహర్షులను భయపెట్టినవాఁడవు గావున స్వర్గపదమునుండి చ్యుతుఁడవై సర్పరూపధరుఁడ వగుదువుగాత"మని నహుషుని శాపదగ్ధునిఁగావించెను. అంతట నగస్త్యశాపదగ్ధుఁ డగునహు షుఁడు ఆక్షణముననే స్వర్గభ్రష్టుఁడై సర్పరూపమును ధరియిం చెను. కాలాంతరమున పాండురాజనందనుఁ డగుయుధిష్ఠిరుని వలన శాపముక్తుఁడై మరల స్వర్గమును బడసినవాఁడయ్యెను.

అగస్త్యుఁడు, పితృవాక్యపరిపాలన ధురంధరుఁ డగు శ్రీరామచంద్రుని వనవాససమయమున నాతని కనేకదివ్యాస్త్ర ములను, అక్షయతూణీరములను నొసంగి యాతని సత్కరించెను. ఆతఁడు రచియించిన రామచరితాత్మకమగు 'అగస్త్యసంహిత' యను గ్రంథము రామోపాసకులచే పవిత్రతమమును, మాన నీయమును నగుగ్రంథముగఁ బరిగణింపఁబడుచున్నది

---

# 11. అష్టావక్రమహర్షి

అష్టావక్రుఁడు కహోడునిపుత్రుఁడు. కహోడుఁడు ఉద్దాలకుని శిష్యుఁడు. గురుభక్తుఁడు.ఆతనిసేవాశుశ్రూషలవలన

ఉద్దాలకుఁడు అత్యంతముఁ బ్రసన్నుఁడై యాతనికి శ్రుతి విద్యాప్రదాన మొనర్చెను. వేదము లెన్ని మంత్రములు గలవో యామంత్రముల కన్నిటికిని నధిష్ఠాతలగు దేవతలు ప్రత్యేకులుగ నొప్పుచుండిరి ఆదేవతలు గురుకటాక్షమువినాగా ప్రసన్నులు గారు. వారు ప్రసన్నులు గానినాఁ డామంత్రములందలి గూఢ తత్త్వమును, రహస్యార్థమును నవగతములు కానేరవు. గురు కటాక్షమునకుపాత్రులై యెవరు వేదవిద్యనునధ్యయనము చేయు దురో వారే వేదవిదులు వేదార్థపరిజ్ఞాతలు. వేదము మంత్ర పూరితమగుట కారణముగ నద్దానికి బ్రహ్మవిద్యయనియు, శబ్ద బ్రహ్మమనియుఁ బేరులు కలిగెను గురుసేవాపరతంత్రుఁడును, బుద్ధిమంతుఁడును నగు కహోడుఁ డాచార్యు నుద్దాలకుని కృపాదృష్టికిఁ బాత్రుఁడై బ్రహ్మవిద్యయొక్క నిగూఢతత్త్వ మును రహస్యార్థమును పరత్వమును హృదయంగమ మొన ర్చుకొని వేదజ్ఞుఁడయ్యెను. ఉద్దాలకమహర్షి కహోడుని సేవా శుశ్రూషలకు అత్యంతము హర్షచిత్తుఁడై యాతనికి వేదవిద్య తోబాటు సుశీలయు శుచిస్మితయు నగు సుజాతయను పేరుగల తనకన్యను సంప్రదాన మొనర్చెను. సుజాతయు పతిసేవాపరా యణురాలై కాలాంతరమున గర్భవతి యయ్యెను. జన్మాంతరసంస్కా రము కారణముగ సుజాత గర్భములోఁ బెరుగుచున్న బాలుఁడు గర్భమందే శాస్త్రజ్ఞుఁడయ్యెను. వేదవిదుఁడయ్యెను. ఆసమయ మునం దొకానొకదినమున మహాత్ముఁడు, కహోడుఁడు వేదపాఠ మొనర్చుచుండుతరి సుజాతగర్భస్థుఁ డగుబాలకుఁడు తండ్రిఁ జేరి "హే! పితః, నీయొనర్చుపాఠము శుద్ధమైనదిగ నుండలేదు నేను గర్భస్థుఁడనై యున్నవాఁడనై యున్నను నాకు సమస్త వేదములయు శాస్త్రములయు నిగూఢతత్త్వము రహస్యార్థము

సంపూర్ణముగ హృదయంగమమయ్యెను" అని పలికెను. ఆపలుకులనాలించి మహర్షి కహోడుఁడు బాలుఁడు తన్నవమానించుచున్నవాఁడని తలంచి, కుపితుఁడై "గర్భమునుండి వెలువడకమున్నే నన్నవమానితునిగఁ జేయుచున్నవాఁడవు. కాఁబట్టి నీశరీర మష్టవంకరలు గలదియగు గాత"మని యాగర్భస్థబాలకుని శాపగ్రస్తునిఁ గావించెను.

సుజాతకు నవమాసములు నిండినవయ్యెను. పదియవ మాసముఁ జొరఁబడియెను. అంతనాపె యేకాంతమున బతిఁజేరి, "ప్రియతమా! హృదయేశ్వరా! నాకుఁ బదియవమాస ముపస్థితమయ్యెను. ప్రసవదివసములు సమీపించుచున్నవి. తాము నిర్ధనులు. ఈసమయము ధనమువినా నిర్వర్తిల్లునదిగాదు. ఈ విపత్సముద్రమునెట్లు పారమొందింపఁగలము!" అని పలికెను. సుజాతపలుకుల నాలించి కహోడుఁడు ధనసంగ్రహాభిలాషియై మిథిలాపతి జనకమహారాజుకడ కరిగెను. జనకునికడ వేదవిదుఁడును, అసాధారణబుద్ధిసంపన్నుఁడును నగువందియను పండితుఁడొకఁడు గలఁడు. ఆపండితునితో జనకసభయందు కహోడునకు శాస్త్రార్థము ప్రవర్తిల్లెను. అందాతఁడు పరాజితుఁడయ్యెను. వంది యాతనిని జలమధ్యమునఁ గూలఁద్రోయించెను. ఈశోచనీయసంఘటనము క్రమక్రమముగ, కర్ణాకర్ణికగ నుద్దాలకునకుఁ జ్ఞాతమయ్యెను. అంతట నాతఁడు సుజాతఁ జేరి, "బిడ్డా! గర్భమందున్న నీపుత్త్రునకీశోకోదంతమును నేవిధముగనైనను నవగతము కానీయకుము. అవగతమైనచో ప్రమాదమువాటిల్లు. జాగ్రత" యని హెచ్చరించెను. అందులకాపె వల్లెయనియెను. పతిశోకకాతర యగుసుజాత కాలాంతరమున నొకపుత్త్రునిఁ బ్రసవించెను. ఆపుత్త్రుఁడు పితృశాపానుసరణముగ అష్టవంకరలు

గలవాఁడుగ నొప్పుచుండెను. అకారణమున నాతఁడు 'అష్టావక్రుఁ'డని పేరొందెను అష్టావక్రుఁడు తల్లి సంరక్షణమువలనను తాతపోషణమువలనను, ఋష్యాశ్రమమునందు పాలితుఁడై సమయోచితసంస్కారములను బడసి పరివర్ధనుఁ డగుచుండెను. ఆబాలుఁడు తండ్రింగూర్చినయువంతము నిసుమంతయు నెరుఁగకుండినకతమున నుద్దాలకుని దండ్రిగను ఆతనిపుత్రుని శ్వేతకేతుని జ్యేష్ఠభ్రాతగను దలంచుకొనుచుండెను. అట్లు పదిరెండు వత్సరముల ప్రాయమువాఁ డయ్యెను అంతట నొకదినమున నాతఁ డుద్దాలకుని తొడపైనఁ గూర్చుండి యుండుటఁజూచి నచ్చుటికి శ్వేతకేతు వరుదెంచెను. తనతండ్రి తొడపైని కూర్చునియున్న యష్టావక్రునిఁజూచి, యీర్ష్యాపరవశుఁడై కన్ను లెఱ్ఱఁజేయుచు, "ఇది నీతండ్రితొడగాదు కూర్చుండుటకు. నాతండ్రితొడ. అందు నీవు కూర్చుండఁదగవు డిగుము." అని పలుకుచు వానిని చేయిపట్టి లాగెను. శ్వేతకేతు వాచరణమునుగని, పలుకులను విని అష్టావక్రుఁడు కడుదుఃఖితుఁడై రోదనముచేయుచు తల్లి కడకరిగి, ఉదాసీనపూర్వకముగ "తల్లీ! నాతండ్రి యెవఁడు. యెక్కడ నున్నాఁడు? కరుణించి నాకెఱిగింపుము" అని యడిగెను. పుత్రుని ప్రశ్న మాలించినంతనె సుజాతకు హృదయస్థమగు శోకము పొంగి కంఠపూరితమయ్యెను. పతికలవడినదుర్గతి తలంపునకుఁ బాఱెను. అంత నామె యశ్రువిసర్జన మొనర్చుచు, ప్రాణాధికుఁ డగుపుత్రుని యొడిలోనికిఁ జేర్చుకొని, గద్గదకంఠమున "పుత్రా! నీతండ్రి నీవు గర్భమందుండినకాలమందు ధనార్థియై విదేహరాజు జనకునికడ కరిగెను. పిమ్మట నాతనివృత్తి విషయమంతయుఁ దెలిసినది కాదు. కాని, కాలాంతరమున జనకసభయందు, తత్సభాపండితుఁడు వందికిని నీతండ్రికిని శాస్త్రవాదము

జరిగినదనియు, అందు నీతండ్రి యోడెననియు, అందువలన నా రాజపండితుఁడు వంది నీతండ్రిని నీటఁద్రోయించెననియును విన వచ్చినయది. ఈవంది నీతండ్రినే గాదు. పలువురను నీటఁద్రో యించి యుండినవాఁడని వినికిలి"అని పలికెను. తల్లిపలికిన పలు కుల నాలించి యష్టావక్రుఁడు తల్లికడనుండి జని శ్వేతకేతుఁజేరి యాతనితో, "నేను రేపు జనకయజ్ఞవాటిక కరిగెదను. అందరిగి పలువురు శాస్త్రజ్ఞులు వేదజ్ఞులు సలుపు శాస్త్రాలాపమును బ్రహ్మ ఘోషమునునాలించిపరితృప్తినిబొందెదను"అనియెను అయ్యది విని శ్వేతకేతు, "నేనును నీతోఁగూడ జనకునియజ్ఞవాటికకు వచ్చెదను" అని బదులొసంగెను. మఱునాఁడు వఱువాత మేన ల్లుఁడు అష్టావక్రుఁడును, మేనమామ శ్వేతకేతును, ఉద్దాల కుని యనుమతి వడసి జనకయజ్ఞవాటిక కరుదెంచిరి. వారలకు తద్వారముకడ జనకరాజదర్శన మయ్యెను. జనకునిఁ జూచి యష్టావక్రుఁడు "జనకరాజేంద్రా! మేము నీయొనర్చు యజ్ఞ మును జూడ వేడుకబొడమ నిం దరుదెంచితిమి. ద్వారపాలురు మమ్ము లోనికిఁ జొరనీకుండిరి. కాఁబట్టి మమ్ములను లోనికిఁ జన నిచ్చుటకు వారలకాదేశింపు"మని పలికెను. ఆపలుకుల నాలించి ద్వారపాలురు"ఋషికుమారా! రాజపండితుఁడు మహామతివంది యాదేశానుసరణముగ శాస్త్రజ్ఞులు వర్షీయసులు నగుబ్రాహ్మ ణులనుమాత్రము లోనికిఁ జొరుటకర్హులు.బాలురు అనర్హులు" అని బదు లొసంగిరి. అంత నష్టావక్రుఁడు "బ్రాహ్మణులలో వేద శాస్త్రవిశారదులు, స్వాధ్యాయనిరతులు తపోరతులు యెవరో వారు వృద్ధులు.క్షత్రియులలో బాహుబలులెవరో వారు వృద్ధులు. వైశ్యులలో ధనధాన్యప్రాచుర్యులెవరో వారు వృద్ధులు శూద్రు లలో వయోధికులెవరో వారువృద్ధులు. అని శాస్త్రములు నిర్ణ

యించియున్నవి. నేను పిన్నవాఁడనైనను నాయందు శాస్త్రజ్ఞానమును, స్వాధ్యాయమును తపస్సును విద్యమానములై యున్నయవి. అందువలన నేను వృద్ధులలో పరిగణింపఁబడదగినవాఁడను; గాని బాలుకలో గణయింపఁబడువాఁడ నెట్లగుదును?" అని నుడివెను. ఆనుడువుల నాలించి జనకుఁ డష్టావక్రుని యథావిధిఁ బూజించెను. అనంతర మష్టావక్రుఁడు జనకునితో, "మహారాజా! నీయాస్థానమున వందియనుపండితుఁ డొకఁడున్నాఁడఁట. ఆతఁడు పలువురను శాస్త్రార్థమందు పరాజితులఁజేసి వారలను జలనిమగ్నులఁ గావించుచున్నవాఁడఁట. ఆతఁ డెంతటిమహాపండితుఁడో! ఆతనితో శాస్త్రార్థముసేయవలయు నను కౌతుకమున వచ్చినవాఁడను" అని యనియెను. అందులకు జనకుఁడు "తాపసకుమారా! నీవు వంది నెన్నఁడును జూచియున్నవాఁడవు గావు ఆతని వైదుష్యప్రకర్షతను గ్రహించినవాఁడవు గావు. అందువలన నాతనితో శాస్త్రవాదమును సలుప నుద్యుక్తుఁడవగుచున్నాఁడవు. నీ వాతనిని శాస్త్రవివాదమున నెన్నఁడును పరాజితుని గావింపనేరవు"అని బదులొసంగెను. అంతట నష్టావక్రుఁడు "జనకభూపాలా! నన్ను బాలునిగ దలంచి యవజ్ఞనిగఁ జేయకుము. కార్యముయొక్క ఫలాఫలమును గనకుండగనే నిశ్చితసిద్ధాంత మొనరించుట బుద్ధిశాలులకు నియతి గాదు" అని జనకునితో ననియెను. అష్టావక్రుని యుక్తియుక్తములును, తేజోమండితములును నగుపలుకుల నాలించి, జనకుఁ డాశాలయంగళమును లోనికి విడిచిపుచ్చుటకు ద్వారపాలుర కాజ్ఞనొసంగెను. అంతట నష్టావక్రుఁడు శ్వేతకేతుసహితముంగ యాగస్థలమున దుపస్థితుఁ డయ్యెను.

అష్టావక్రుఁడు, పలువురుపండితులు పరివేష్టించియుండ వందితో శాస్త్రవాద మొనరించెను. ఆతనికి సంపూర్ణపరాజయమును సమకూర్చెను. వంది అష్టావక్రునివలనఁ బరాజితుఁడగుటఁ గని రాజర్షి జనకుఁడు, అష్టావక్రునిఁ జేరి, "ఓ ద్విజకుమారా! నేను నీపాండిత్యప్రకర్షతకు అత్యంతము సంతుష్టుఁడనైతిని. నీవు వయసున చిన్నవయ్యును బుద్ధిని పెద్దవైతివి. నావలన నీకు వలయున దేదియో యొఱిఁగింపు" మని యడిగెను. అందులకు అష్టావక్రుఁడు "మహారాజా! వంది పలువురపండితులను పరాస్తులఁ జేసి వారలను నీటఁద్రోయించియుండెనుగదా! అందువలన నేను నాతనిని జలనిమగ్నునిగఁ జేయవలయునని కోరుచున్నాఁడను" అని జనకునకు బదులొసంగెను. అష్టావక్రుని కోరికచొప్పున జనకుఁడు వందిని నీటఁద్రోయించెను.

ఆకాలమున జలాధిపతి, వరుణుఁ డొకబృహద్యాగమును సలుప నుపక్రమించెను ఆసమయమున నాతఁడు వంది వలన జలనిమగ్నులైయున్న పండితులను యజ్ఞమందు నియుక్తులఁ గావించెను. యజ్ఞము నిర్విఘ్నముగ పరిసమాప్తమయినంతనె వరుణుఁ డాపండితులను, ఒమాళి ధనరాసుల నొసంగి సంతుష్టులఁ గావించి నిరుపద్రవముగ జనకరాజుకడ కనిచెను. అట్లు వరుణసత్కారములఁబడసి జలరాశినుండి వెలువడినవారలలో కహోడుఁ డొకఁడు. కహోడునిఁ జూచినంతనె, యష్టావక్రుఁ డాతని తనజనకునిగా నెఱింగి, యపరిమితానందమును బొందుచు నాతనికిఁ బ్రణుతులొసంగెను. పుత్రుని పరిచయమును బడసి కహోడుఁడు ప్రహర్షచిత్తుఁడయ్యెను. ఆతని హృదయమునఁ జేర్చెను. మూర్ధమును ముద్దుగొనియెను. అనంతరము రాజర్షి జనకునిఁ జేరి "మహారాజా! లోకులు పుత్రులఁ బడయుఁ

గోరుటకు కారణ మిదియేగద! చూడుము. నేను సాధింపనే...
కార్యమును నాపుత్త్రుఁ డవలీలగ సాధింపఁగలిగెను” అని యని
యును. జనకుఁడు ప్రసన్నుఁడై కహోడుని, అమితధన మొసంగి
సత్కరించెను. అనంతరము విజయగర్వమునఁ గర్వితుఁడై
యష్టావక్రుఁడు జనకునియనుమతినిఁ బడసి నిజజనకునితో,
మేనమామతో జననికడ కరుదెంచెను. అట్లరుదెంచిన పతి
పుత్త్రులఁ గని సుజాత సంతోషవారిధి నోలలాడఁజొచ్చెను.
పుత్త్రుని కార్యసాధనమునకు కహోడుఁడు కడుప్రసన్నుఁడై,
“పుత్త్రా! నేను నీయెడలఁ బ్రసన్నుఁడ నైతిని. నాయొసంగిన
శాపమువలననే నీశరీరము అష్టవంకరలను లోనయ్యెను. నీవీ
నదీజలముల స్నానమాడుము. ఋజుగాత్రుఁడ వగుదువు” అని
యష్టావక్రున కాదేశించెను. పిత్త్రాదేశముచొప్పున నష్టావ
క్రుఁడు నదీజలముల స్నానమాడి, వక్రశరీరమును వీడి సుందర
తనుధారి యయ్యెను. అష్టావక్రుని వక్రతను దూరమొనర్చిన
యానది యదిమొదలుగ ‘సమంగ’ యను నామమును బడసి
ప్రఖ్యాతము గాఁజొచ్చెను.

అనంతర మొక్కింతకాలమున కష్టావక్రుఁడు, మహర్షి
వదాన్యునిచెంత కరిగి, యాతనికన్యను త్రిలోకసుందరిని,
సుప్రభానామ్నిని వివాహమాడ నెంచి, యాతనియెదుట తన
యీప్సితమును బ్రకటించెను. అందులకు వదాన్యుఁడు నీవు
నాకన్యఁ బరిణయమాడ నెంచితివేని, నీవొకపరి కైలాసపర్వత
మున కరుగవలయు. అందు నీలవనమనుపేరుగల వనమొకటి
గలదు. ఆవనములోని కేగితివేని అందొకవృద్ధతపస్వినిఁ గనఁ
గలవు. ఆవృద్ధతపస్వినిఁ దర్శించివచ్చితివేని నీమనోకామనము
పూర్తికాఁగలదు”. అని బదులొసంగెను. వదాన్యునిమాటల

నాలించి, యష్టావక్రుఁ డాతనికి నభివాదనమొనర్చి, యాతని యాశీస్సులఁ బడసి కైలాసపర్వతమున కరిగెను. అందలి 'బాహూదా' నదియందలి పవిత్రోదకముల స్నానమాడి యల కాపురిఁజేరి యక్షరాజు కుబేరునివలన సత్కృతులఁబడసెను.పిమ్మట నాతని యనుమతినిబడసి నీలవనమరయుటకుఁ బయలువెడలెను. ఒక్కించుకదూర మరిగి యొకమనోహరమగు నుద్యానవనమును, ఆవనమం దొకయాశ్రమమును గనియెను. ఆయాశ్రమము లోని కేగినంతనె యాతని కొక దివ్యభవనము చూపట్టెను. ఆతఁ డాభవనద్వారమును డగ్గఱిలి యుచ్చైస్స్వనమున "ద్వార ముకడ నతిథియొకఁడు నిలిచియున్నవాఁడు. లోపల నేవైన నుండి రేని యరుదెంచి యాతనిసత్కరింపుఁడు" అనిపలికెను.ఆతఁ డట్లుపలుకుటయెతడవుగ నాసుందరభవనమునుండి యేడుగురు సర్వాంగసుందరులగు తరుణీమణు లరుదెంచి యాతని నాదర సత్కారములతో నొకసుసజ్జితమగుగదిలో మృదుతరశయ్యపై కూర్చునియున్న శుక్లాంబరధారిణి, సర్వాభరణభూషిణి యగు నొకవృద్ధాంగన యెదుటకుఁ దోడ్కొని పోయిరి. వృద్ధాంగ నయు మహర్షిఁ జూచినంతనె యాతని సుస్వాగతునిఁ గావించి సుఖాసనమునఁ గూర్చుండఁజేసెను మహర్షి యాస నోపవిష్టుఁడై యావృద్ధాంగన కాశీర్వాదమొసంగెను. ఆతఁ డాభవనమందు నిలిచి యావెయొసంగు పరిచర్యలఁగొనుచు విశ్రాంతినిగనఁజొచ్చెను. రాత్రియగుడు నాతఁ డొక సుకోమల శయ్యపై శయనింపఁబోవుచు, నావృద్ధాంగనతో, "రాత్రి యెక్కుడయ్యెను ఇఁక నీవు శయనింపనేగుము" అని చెప్పెను. అంత నావృద్ధ యందుండి చని వేఱొకశయ్యపై మేనువాల్చెను. అనంతర మొక్కించుకతడవగుడు నావె శీతబాధకు లోనై గడ

గడ పడఁకుచు లేచిచని మహర్షి ప్రక్కఁజేరి యాతని గాఢాలిం
గనమొనర్చి పరుండఁజొచ్చెను. అంత నాముదుసలి యాయవస్థఁ
జూచి చింతిలుచు నామహర్షి తనశరీరమును బిగ్గగ బిగఁబట్టి
శయ్యనంటుకొని పరుండసాగెను. అట్లు పరుండి యాలింగనమున
కవశుఁడై యున్న యామహర్షిఁ జూచి, యాముదుసలి, కామా
సక్తయై, తనమనోవాంఛను పూర్ణముగావింపుమని కడేపదే
ప్రార్థింపఁజొచ్చెను. ఆమె యెంత ప్రార్థించినను, ఆమహర్షి "ఇట్టి
పాపకర్మమునకు నే నొడఁబడనేరను." అని తనయసమ్మతమును
స్పష్టముగ నామె కెరిగించెను. అందుపై నాయవ్వ "నేను ముదు
సలిని గాను. తరుణిని. ఒకరిరక్షణము లోనిదానను గాను.
స్వతంత్రను. కాఁబట్టి నాపాణిఁ గ్రహియించి నాకోర్కెఁదీర్పుము.
దాన పాప మొనఁగూడనేరదు" అని యాతని బలాత్కరింపఁ
జొచ్చెను. ఆమె యెంత బలాత్కరించినను ఆమహర్షి విచలుఁడు
గాక వృక్షమువలెఁ స్థిరుఁడై, యింద్రియనిగ్రహుఁడై యాతరుణీ
మణితో, "ఓసుశీలా! నీవు వేయిమాటలు చెప్పుము వేయి చేష్ట
లొనరింపుము కాని, నాహృదయము ధర్మపథమును విడి పతి
తము కానేరదు. నన్ను మన్నింపుము" అని సకల వైనము స్పష్టము
లేమిని వెల్లడిచేసెను. ఆవృద్ధతపస్విని యెవ్విధమునను నామ
హర్షిని పథభ్రష్టుని గావింపనేరనిదయ్యెను. అంత నావృద్ధరమణి,
"హే తపోధనా! నేను నీవంటి ధైర్యశాలిని, నీవంటి జితేంద్రి
యుని వేఱొకనిఁ జూచియుండలేదు. నిన్నుఁ బరీక్షించుటకునై
యిట్లొనర్చినదానను. నేను సామాన్యస్త్రీనిగాను ఉత్తరదిశ
కధిష్ఠాత్రి నగు దేవిని. మహర్షివదాన్యుఁడు నిన్నేకోరికతో
నిందు పంపెనో యాకోరిక సంపూర్ణరూపమున సఫలమగుట గని
యెను. ఇఁక నీవామహర్షి కడ కరిగి యాతనికన్యను సుప్రభను

పాణిగ్రహణ మొనర్చుకొని సంతానోత్పత్తిపూర్వకముగ పితృఋణపరిశోధకుఁడవు గమ్ము పొమ్ము." అని పలుకుచు, నాతనికి స్వగృహమునకు మరలుట కనుమతినొసంగెను. అష్టావక్రుఁడు మరలివచ్చినంతనె, వదాన్యుఁడు నీలవనవృత్తమునుగూర్చి యాతనిఁ బ్రశ్నించెను. ఆతఁడామహర్షితో, తాను చూచినది చూచినటుల, జరిగినది జరిగినటుల వివరించిచెప్పెను. అయ్యది యాలించి వదాన్యుఁడు ప్రహర్షచిత్తుఁ డయ్యెను. అనంతరము ప్రసన్నతాపూర్వకముగ సుప్రభను యాతని కొసంగి, విధ్యుక్తముగఁ బరిణయ మొనర్చెను. అష్టావక్రుఁడు సుప్రభగర్భము నుండి యొకపుత్రునిఁబడసి పితృఋణముక్తుఁ డయ్యెను.

అష్టావక్రుచరిత్రమును బ్రహ్మవైవర్తపురాణ మీవిధముగఁ జెప్పుచున్నది. అసితమహర్షి తనయుఁడు దేవలుఁడు గంధమాదనపర్వతమునందు తపస్సు చేయుచుండుతరి, సంయోగవశమున నం దరుదెంచిన యప్సరాంగనరంభ, కంతువసంత జయంతులఁబోలె సుందరాకారుఁడై వెలుఁగుచున్న యాతనిఁ జూచి, మోహపరవశయై, తనమనోవాంఛను ఆతని కెరింగించెను. ఆతనిఁ బలాత్కరించెను. పలువిధములఁ బ్రార్థించెను. ఆతఁ డందుల కంగీకరింపక, యామెప్రార్థనమును తృణీకరించెను. అందుపైని రంభ కుపితయై, "హేవక్రవిప్రా! నీశరీరము వక్రత గలదిగను, కాలాంజనసదృశమగు కృష్ణవర్ణము గలదిగను యగుఁగాత! నీరూపయౌవనములు వినష్టములగుగాత! నీవు జగత్తునందు అద్భుతవికటాకారుఁడ వగుదువుగాత! నీతపస్సం తయుఁ వినష్టమగుఁ గాత," యని దేవలునకు శాపమొసంగి యం దుండి వెడలిపోయెను. రంభశాపమునకు గుఱియైన దేవలునకు హరిపాదపద్మసందర్శనము దుర్లభమయ్యెను. అందువలన నాతఁ

దుస్థితిగ్నుఁడై, తనశరీరము పూర్వపుణ్యవర్జితమై వికృతరూప ముగలదియై యుండుటను జూచి సహింపనేరక, శోకసంతప్త హృదయుఁడై, యగ్నికుండమునఁబడి ప్రాణవిసర్జన మొనర్చుట కుద్యుక్తుఁడయ్యెను. ఆతఁ డీవిధముగ నుద్విగ్నుఁడగుటఁజూచి, శ్రీహరి కరుణార్ద్రహృదయుఁడై యాతనికడ కరుదెంచి యాతనికి దివ్యోపదేశ మొసంగి ధైర్యముఁ గరపెను. దేవలుని శరీరమం దష్టవంకర లుండుటఁగని శ్రీహరి యాతనికి అష్టా వక్రుఁడని పేరిడియెను.

అష్టావక్రమహర్షి జనకమహారాజునకు ప్రశ్నోత్తర రూపముగ జ్ఞానోపదేశ మొసంగెను. ఆయుపదేశము గ్రంథ బద్ధమై "అష్టావక్రసంహిత" యను నామమునఁ బ్రసిద్ధిఁ గను చున్నయది. అయ్యది యుత్తమోత్తమ గ్రంథరాజము.

---

# 12. సంవర్తమహర్షి

అంగిరమహర్షి బ్రహ్మమానసపుత్రులలో నొకఁడు. ఆతఁడు కర్దమపుత్రికను,ధర్మశీలను,శ్రద్ధను పరిణయమయ్యెను. ఆతనికి శ్రద్ధాదేవిగర్భమునుండి, యుతథ్యుఁడు, బృహస్పతి. సంవర్తుఁడు ననుముగ్గురు కొమరు లుదయించిరి. వారు ముగ్గు రును కాలానుగుణముగ వేదవిదులును, శాస్త్రజ్ఞులును, తపస్వు లును నైరి. ఆసోదరులు ముగ్గురిలో బృహస్పతి సంవర్తు లన్యో న్యము స్పర్ధాళువులై యొప్పుచుండిరి. ఆయిరువురు నీర్ష్యాపర వశులై యొకరినొకరు ద్వేషించుకొనుచుండిరి. జ్యేష్ఠుఁ డగు బృహస్పతి కనిష్ఠుఁడగు సంవర్తున కత్యంతకష్ట మొదఁగూర్చు

చుండెను. ఆతనివలన కలుగుచున్న కష్టము దుస్సహమగు చుండిన కతమున సంవర్తుఁడు వివస్త్రుఁడై వనవీధులఁ దిరుగాడఁ జొచ్చెను. ఆకాలమందే దేవేంద్రుఁడు దైత్యుల జయించి మహామతి బృహస్పతిని దేవతలకుఁ బురోహితునిగ నియుక్తునిఁ గావించెను. అంగిరమహర్షి కరంధమ మహారాజునకుఁ గుల పురోహితుఁడు కరంధమునకు మరుత్తు పౌత్రుఁడు మరుత్తు పితామహ పితరులయనంతరము సింహాసనారూఢుఁడై ప్రజలను నిజప్రజలఁబోలె పరిపాలింపఁజొచ్చెను. దేవేంద్రుఁడు మరుత్తుని యం దేలకో ద్వేషమూని యున్నవాఁడు అకారణమున నాతని నవమానితునిఁ గావింపవలయునని మదినెంచి నిరంతరము తత్ప్రయత్నమొనరింపఁజొచ్చెను; కాని, సఫలమనోరథుఁడు కాఁజాలకుండెను. అంతనొకనాఁ డాతఁడు నిండోలగమునఁ బుండి బృహస్పతిఁజీరి, "దేవగురూ! నేను ముల్లోకముల కధిపుఁడను, మరుత్తు కేవలము భూలోకమునకు మాత్ర మధిపుఁడు, నీవు మృత్యుపీఠను లగుసురులకు పురోహితుఁడవై యుండియు, మృత్యువశవర్తి యగునరునకు మరుత్తునకు పౌరోహిత్య మొనర్చుచుండుట యుచితవర్తనము గానేరదు. కాఁబట్టి యయ్యది యొనరింపవలదు. మరుత్తుని పౌరోహిత్యము వదలుకొనుట కియ్యకొనఁజాలవేని,నిన్ను పురోహితునిగ నునిచికొనుటకు నే నియ్యకొననేరను." అని చెప్పెను. ఇంద్రుని మాటల నాలించి యాతనికి బృహస్పతి, "స్వర్లోకాధిపా! దేవేంద్రా! నేను మరుత్తునకు పౌరోహిత్యము సేయఁబోల్లను. అంతియకాక నీకముం దెన్నఁడును మనుష్యులు చేయు యజ్ఞమందు ప్రవగ్రహణ మొనర్చువాఁడను గాను" అని యిదెకృత ప్రతిజ్ఞుఁడ నగుచున్నాఁడను. నా ప్రతిజ్ఞ యెన్నఁటికిని భంగము

కానేరదు అని సమస్తదేవతలయెదుట ప్రత్యుత్తర మొసఁగెను. బృహస్పతి ప్రతిననాలించి స్వర్గాధిపతి సంతుష్టచిత్తుఁ డయ్యెను.

ఇంద్రసమ్ముఖమున బృహస్పతి యొనర్చినప్రతిన మరుత్తునకు కర్ణగతమగుడు, ఆతఁ డొక బృహద్యాగ మొనర్చుటకాయోజనము చేయుచు, బృహస్పతి చెంత కరిగి, "గురూత్తమా! మీరు నాకు కులపురోహితులరు. నే నొక యజ్ఞమును సలుపమనఁ దలంచితిని. కాఁబట్టి నాయందు కృపఁజేసి యరుదెంచి నాయొనర్చుయజ్ఞమును సుసంపన్నమగుదానిగఁ జేయుఁ"డని యాతని సవినయభయభక్తులతోఁ బ్రార్థించెను మరుత్తుని ప్రార్థన మాలించి బృహస్పతి, "వత్సా! నేను దేవేంద్రుని పౌరోహిత్యమును గ్రహియించినవాఁడ నగుటచే, దేవతలయెదుట, మనుష్యులకుఁ బౌరోహిత్య మొనర్పనని బాసఁజేసియున్నాఁడను. కాఁబట్టి ఆబాస కిపుడు ప్రతికూలుఁడనై నీచే యజ్ఞమును జేయింపనేరను" అని బదులొసంగెను. అంతకు మరుత్తు మిగుల చింతిలుచు "దేవా! మీరు నాకు వంశపరంపరాగత పురోహితులరుగాని నేఁటివారు గారు. అట్టిసమయమున నా పురోహితమును బోనాడి నన్ను నిరుత్సాహునిగఁ జేయుట ధర్మముగాదు. నన్ను కరుణింపుఁడు. నాచే యజ్ఞమును జేయింపుఁడు" అని బృహస్పతిని బలువిధములుగఁ బ్రార్థించెను. మరుత్తు ఎంత ప్రార్థించినను బృహస్పతి యాతనిచేత యజ్ఞమును జేయించుటకియ్యకొనఁడయ్యెను. అంత మరుత్తు కడుదుఃఖితుఁడై, యుదాసచిత్తుఁడై స్వగృహమునకు మరలుచు, మార్గమధ్యమున దైవికముగ నారదుని సందర్శించెను నారదుఁడు మరుత్తుని సాంత్వన వచనముల ననునయించి యాతనియుదాసీనతకు కారణమేటిదని యడిగెను. దేవర్షి పలికిన సాంత్వనావచనముల నాలించి మరుత్తు,

కులపురోహితుఁడు ఆంగిరసుఁడు పలికిన నిరాదరణపుపలుకు నాతనికి వినిచెను. ఆపలుకుల నాలించి దేవర్షి, "రాజా! ఉదాసీనుఁడవు గాకుము. అంగిరునకు కనిష్ఠపుత్రుఁడును,బృహస్పతికి కనిష్ఠభ్రాతయు నగుసంవర్తమహర్షిని దోడ్తెచ్చి యజ్ఞనేతృతఁడవు గమ్ము. ఆతఁడు నీయొనర్పు యజ్ఞమును విధిపూర్వకముగఁ జేయింపఁగలఁడు." అని మరుత్తునితోఁ జెప్పెను. దేవర్షి చెప్పిన మాటనాలించి మరుత్తు సంతోషతరంగితాంతరంగుఁడై, "యో తపోధనా! నే నాకులపూజ్యుఁడగు అంగిరోనందనుని సంవర్తుని యొందుఁ గనఁగలను? ఆమహనీయునిసందర్శన మెటులఁ బొందఁగలను." అని యాతని నడిగెను. అందులకు నారదుఁడు, "ఓ! రాజా! సంవర్తమహర్షి చిత్తవిభ్రమునిఁ బోలె దిగంబరియై ప్రకృతము విశ్వనాథసందర్శనార్థము కాశీపురమందు పరిభ్రమించుచున్నవాఁడు. నీ వందేగి విశ్వనాథమందిరద్వారముకడ నొకశవమును నిలుపరించి యందు వేచి యుండుము ప్రాతఃకాలమున విశ్వేశ్వరసందర్శనమున కరుదెంచువారలలో తన్మందిరద్వారమందు దోఁపయున్న శవమును జూచి యేమహనీయుఁడు వెనుకకు మరలునో, యామహనీయుఁడే సంవర్తుఁడని గ్రహింపుము. ఆతఁ డేదిక్కునకు మరలునో నీవాదిక్కున కాతని వెనువెంటనే యరుగుము. ఆతఁడు నిర్జనప్రదేశమున కరిగినప్పుడు నీ వాతనికి సమ్ముఖుఁడవై, నీమనోవాసనను బ్రకటింపుము. నాయుదంతమును ఎట్లు తెలియఁగలిగితివని యాతఁడు నిన్నడిగినపుడు, నారదునివలనఁ దెలియఁగలిగితినని చెప్పు"మని మరుత్తునితోఁ జెప్పి తా నెందేని చనియెను.

మరుత్తు నారద నిర్దేశానుసరణముగ వారాణసీపురి కరిగెను. ఆతని యుపదేశము చొప్పున ప్రవర్తిల్లి సంవర్తమహర్షి

సందర్శనమును బడసెను. సంవర్తమహర్షి మరుత్తుని బొడ గాంచినంతనె యాతనిపై రాళ్లను రువ్వఁజొచ్చెను. ఆతనిపై నశుద్ధపదార్థములు వైవఁదొడంగెను. ఆతనిముఖముపై నుమియ జొచ్చెను. ఆతనిఁ బలువిధముల నవమానితునిగఁ జేసెను. మహర్షి యెంత నింపించినను, ఎంత యవమానించినను మరుత్తు విముఖుఁడుగాక యాతనివెనువెంటఁ జనఁజొచ్చెను. మహర్షి యత్యంత దూరమరుగుట కారణముగ మిక్కిలిగ బడలికఁ గొనినవాఁడై యొక వటవృక్షచ్ఛాయయం దాసీనుఁడై విశ్రాం తిని గొనఁజొచ్చెను. ఆసమయమున మరుత్తు ముకుళితకర కమలుఁడై మునియెదుటికిఁ జని నిలిచెను అట్లు వినమ్రుఁడై యెదుట నిలిచిన రాజుఁ జూచి యామహర్షి, "హే! రాజన్! నాయునంత మెట్లు గ్రహింపఁగలిగితివి? నావలన నేమి యాశిం చితివి?" అని యడిగెను అంత రాజు, "ఓమహర్షిశేఖరా! మీ సంగతి నారదునివలనఁ దెలియఁగలిగితిని నే నొకయజ్ఞమును జేయసమకట్టితిని. తామరు వెంచి యాయజ్ఞమును సుసంపన్నముగ దానిగఁ గావింప తమ్ముఁ బ్రార్థించుచున్నాను. ఇదియె నామనో వాంఛితము. నన్నుఁ గరుణింపుఁడు" అని యామహర్షికిఁ ద వినయముగ విన్నవించెను. మరుత్తునివాంఛిత మెరింగి మహర్షి రుష్టుఁడై కర్కశస్వరమున, "రాజా! నేను వెఱ్ఱివాఁడను. వికలచిత్తుఁడను. నావలన నీయజ్ఞము యథోచితరీతిని సంపాది తము కానేరదు. నాసోదరుఁడు బృహస్పతిఁ గొనితెచ్చి యాగ సంపాదితము గావింపుము. ఆతఁడు యజ్ఞవేత్తుఁడు. అట్లు కాక, నీవు నావలననే యజ్ఞసంపాదనమును గావింపనెంచితివేని యాతని యనుమతిని బడసిరమ్ము" అని పలికెను. అంత మరుత్తు, సురగురునకును తనకును పూర్వప్రవర్తిత మగుసంభాషణము

సంవాదము సమగ్రముగ వినిచి, "మహర్షివర్యా! బృహస్పతి దేవపురోహితుఁ డయ్యెను. అందువలన నాపౌరోహిత్యమును జేయుట తన కవమానదమని తలంచినవాఁడు. అంతియకాదు. ఇంద్రుఁ డాపౌరోహిత్యమును జేయవలదని యాతని నిర్బంధించియుండెను" అని మహర్షి యెఱిఁగించెను. అయ్యది విని సంవర్తుఁడు, "రాజేంద్రా! నేను నీచేత యజ్ఞమును జేయించుటకు ప్రారంభ మొనరించితినేని, ఇంద్రుఁడును బృహస్పతియు నాపై క్రుద్ధు లయ్యెదరు. నాకనిష్ట మొనఁగూర్పఁ దొడంగెదరు. అపుడు నీకు నాయందుఁ గలభక్తి సుస్థిరముగ నిలిచి యుండునా యగునో కాదో యనుసంశయమున నాహృదయ మూఁగులాడుచున్నయది. నీవు నాయెడ దృఢభక్తుఁడ వగుదువేని, నేను నీకోరికను బూర్తి యొనరింపఁ గలను." అని మరుత్తునితో ననియెను. అందులకు మరుత్తు, "ఋషిచంద్రమా! అక్లిన్నుఁడను సందియ మొందకుఁడు మీయందలి భక్తి సుదృఢమైనదని త్రికరణశుద్ధిగఁ బలుకుచుంటిని. అయ్యది యెన్నఁడు నెవ్విధమునను కొఱవడనేరదు." అని సుస్పష్టముగఁ బలికెను. ఆపలుకుల నాలించి, మహర్షి "రాజేంద్రా! నాకు ధనధాన్యములయం దిసుమంతయు నాసలేదు. కేవలము, ఇంద్రసదృశుఁడ వగుటకునై నీచే యజ్ఞమును జేయించుట కియ్యకొనుచున్నాఁడను. కాఁబట్టి నీకొక యుపదేశ మొసంగుచున్నాఁడను. గ్రహింపుము. నీవు మునుముందు హిమాలయమున కరిగి దేవాదిదేవుని మహాదేవుని తపంబొనర్చి మెప్పింపుము. హిమాలయప్రాంతమునందలి ముంజవత్పర్వతమందు సువర్ణఖని యొండు గలదు. ఆగనిని ఈశ్వరకటాక్షమునకుఁ బాత్రుఁడవై, గ్రహించి యందలి సువర్ణమును గొనితెచ్చి యద్దానివలన యజ్ఞ

సామగ్రిని సంగ్రహింపుము. దాన నీయొనర్చుయజ్ఞ మమోఘ
ముగఁ బ్రవర్తిలగలయగు" నని చెప్పెను. సంవర్తోపదేశమును
శిరోధార్యమొనరించి, కృతకృత్యుఁడై యాగదీక్షఁ గైకొని
యెను.ఆవల సురగురువు,తనసోదరుఁడు మరుత్తునిచేత నొకమహా
యజ్ఞమును చేయించి తన్మూలమున మహాధనికుఁడు గానున్న
వాఁడని యెఱింగి వికలచిత్తుఁ డయ్యెను. ఆచార్యుఁ డస్వస్థ
చిత్తుఁ డగుటఁ జూచి యింద్రుఁడు చింతిలుచు,తత్కారణమును
వివరింపుఁడని యాతనిఁ బ్రార్థించెను. అంత బృహస్పతి
యింద్రునకు యావద్వృత్తమును వినిచి, "పురందరా! నాకు
సంవర్తుఁడు ఘోరశత్రుఁడు. దైత్యోన్నతి యాదిత్యులకు
హృదయకంటక మగుతెఱంగున సంవర్తుని యౌన్నత్యము
నాకు హృదయకంటకమగు. అద్దానికి నేను సహింపఁజాలను.
కాఁబట్టి, యింద్రా! మీర లేవిధముగనైనను మరుత్తసంవర్త
లను యజ్ఞనివృత్తులఁ జేయుఁడు. దాన నాకు మనస్స్వస్థత
మలవడు"నని చెప్పెను. అంత నింద్రుఁడు హుతాశనుని
రావించి, "అనలా! నీ వీసురగురుని వెంటఁగొని మరుత్తునికడ
కరుగుము.ఆతనితో,సంవర్తుని విడనాడి యీసురగురుని యాజ్ఞి
కునిగఁ జేకొనుము. ఈతఁడు నీ కమరత్వ మొదఁగూర్చునని
చెప్పుము." అని యాతని కాదేశించెను. అనలుఁడు దేవేంద్రుని
యాదేశముచొప్పున మరుత్తునికడ కేగి యాతనికి నింద్రసందేశ
మును వినిచెను. ఇంద్రసందేశ మాలించి మరుత్తు అనలబృహ
స్పతులను భక్తియుక్తముగఁ బూజించి, వారలతో, "దివ్యు
లారా! నేను సంవర్తమహర్షిని యాజకునిగ నియుక్తునిఁ
జేసికొంటిని. ఇక నిపుడు బృహస్పతిని పురోహితునిగఁ జేసి

కాననేరను." అని సవినయముగఁ జెప్పెను. అయ్యది యాలించి యగ్నిదేవుఁడు, సంవర్తునియెడ మరుత్తునకు గలభక్తిని కొంచ పఱుదానిగఁ జేయనెంచి, యాతని ననేకవిధముల ప్రలోభునిగఁ జేయనెంచి తత్ప్రయత్న మొనరింపఁజొచ్చెను. అగ్నిదేవుని వర్తనమును జూచి సంవర్తుఁడు కుపితుఁడై యాతనిఁ జేరి, "అనలా! యీక్షణమున నిందుండి వెడలిపొమ్ము. తడయకుము" అని శాసించుచు, "ఇఁకముందెన్నఁడైన బృహస్పతివెంట మరల నరుదెంచితివేని నిన్ను శపియించెదను." అని పలికెను. అనలుఁడు భయకంపితుఁడై బృహస్పతిఁ దోడ్కొని యింద్రుని చెంతకేగి యావద్వృత్తమును వినిచెను. అగ్నిదేవుఁడు చెప్పినది వినియును ఇంద్రుఁ డూరకొనక మరల నగ్నితో, నీవింకొక సారి బృహస్పతితో మరుత్తునికడ కరుగుము. ఆతనితో నామాటుగ నామాట మన్నింపవేని నిన్ను వజ్రప్రహారమునకుఁ బాలుగావించెద నని చెప్పు"మని చెప్పెను. ఆమాట నాలించి యనలుఁడు, "ఆతనికడకు నే నరుగఁజాలను. అరిగితినేని నన్ను సంవర్తుఁడు శాపదగ్ధునిగఁ జేయును ధృతరాష్ట్రునిఁ బనిచిన నీకార్యము సాధితమగు" నని యింద్రునకు విన్నవించెను. అనలుఁడు బ్రాహ్మణశాపమునకు వెఱగొందుచున్నవాఁడని తలంచి యింద్రుఁడు ధృతరాష్ట్రుని సందేశహారిగ నియుక్తునిఁ గావించి మరుత్తునికడ కనిపెను. ధృతరాష్ట్రుఁడు మరుత్తునిఁ జేరి యింద్రసందేశ మెరిగించుఁడు, ఆతఁడు, "నేఁ జేయవలయునది యిదివరకే చేసియుంటిని. ఇఁక నిపుడు వేరొండు చేయుమందు సంవర్తుని పరిత్యజించి బృహస్పతిని పరిగ్రహించి నవై, గ్రహి నియుక్తుఁ జేసితినేని అయ్యది యధర్మవర్తనమగు వలన యజ్ఞ

గనలి సంవర్తుఁడు నన్ను శపియించు అందులకు నే నియ్యకొన
నేరను" అని బదులొసంగెను అందులకు ధృతరాష్ట్రుఁడు
గినిసి, "నీవు ఇంద్రసందేశమును మన్నింపకున్నాఁడవు.
అదుగో, వజ్రాయుధమునుగొని యింద్రుఁ డంతరిక్షమున నెట్టుల
సింహనాద మొనర్చుచున్నవాఁడో! చూడుము" అని పలుకుచు
మరుత్తునకు భయముఁగొలుపఁ జొచ్చెను. మరుత్తు కన్ను లెత్తి
యాకాశమునకుఁ జూచి వజ్రహస్తుఁ డగుపురందరునిఁ గని
భయకంపితుఁడై, తపోనిధియుఁ మహాత్ముఁడును నగుసంవర్త
నకు వృత్తాంతమును వివరించి చెప్పి, యాతనితో
"మహాత్మా! మన మఖము నింద్రుని వజ్రమున కెఱ
గాకుండ నుపాయ మొండు పరికింపుఁడు" అని యనియెను.
అంత నామహర్షి యారాజుతో, "నీ విసుమంతయు జింతిల
కుము. నేను స్తంభనీవిద్యచే నాతని చేతులను స్తంభీభూత
ములుగఁ గావించి నీ భయమును దూర మొనర్చుచున్నాఁడ"
నని చెప్పుచు నింద్రుని చేతులను స్తంభీకృతములుగ గావించెను.
అనంతరము మంత్రోచ్చారణ మొనర్చుచు సమస్త దేవతా
సహితముగ నాతని నాహూతుని గావించి, "రాజా,
అదుగో, నామంత్రబలమున కెదురునిలువనేరక దేవేంద్రుఁడు
దేవతాసహితముగ నెట్టుల తత్తఱ మొందుచు యజ్ఞవాటిక
కరుదెంచుచున్నవాఁడో చూడు"మని యనియెను. అంత
ఇంద్రుఁ డరుదెంచి సంవర్తునకు శరణాగతుఁ డయ్యెను.
డాతనికి చైతన్య మొసఁగెను. స్వాగత మిచ్చెను అతని
న్యాసవిధులఁ బూజించెను. ఇంద్రుఁడు మరుత్త
న్నవలంబడసి యజ్ఞమునందు దేవతాసహితముగ

సుపూజితుఁడై యుండుటయేగాక యజ్ఞమందు యథాయోగ్యముగు భారమునుగూడ గ్రహించెను మరుత్తుని యజ్ఞము నిర్విఘ్నపరిసమాప్తిఁ గనియెను శచీధవుఁడు మరుత్తునియెడఁ బ్రసన్నుఁడై యాతనితో, "మహారాజా! నీయెడ సంతుష్టుఁడనైతిని. వారుగో చూడుము అమరులును నీపూర్వపురుషులును నీయెడఁ బ్రసన్నులై దివంబున విరాజిలుచు నీకాశీస్సులొసంగుచున్నవారలు. భక్తిపూర్వకముగఁ జేకొనుము" అని చెప్పుచు తాను సురలోకమునకుఁ బ్రస్థానుఁ డయ్యెను సంవర్తుఁడు మరుత్తునిచేఁ బూజితుఁడై తపంబొనర్ప నరణ్యమున కేగెను.